# రమణ భాషణములు ఆరవ సంపుటం

## భాషణము 501

ఒక మైసూరు యువకుడు - నేనీదేహాన్నెలా పొందాను?

మహర్షి: 'నేను' 'నా దేహము' అంటున్నావు. ఆ రెంటికి సంబంధముంది. అంతేగాని దేహం నీవు గాదు. దేహం జడం. కనుక దానికా ప్రశ్న కలుగదు. ఒక సందర్భంలో నీ దేహము నీకు స్ఫురించదు. అదే గాఢ నిద్ర. అప్పుడు ఈ ప్రశ్నరాదు; అయినప్పటికీ నిద్రలో నీవున్నావు. మరి ఇప్పుడు ఆ ప్రశ్న ఎవరికి కలుగుతున్నది?

భక్తుడు: అహంకారానికి.

మహర్షి: అవును. దేహమూ అహంకారమూ రెండూ ఒక్కమారే పుడతాయి. ఒక్కమారే అణగిపోతాయి. గాఢనిద్రలో ఈ అహంకారముతో నీకు సంబంధమే లేని సందర్భమొకటి ఉంది. మేల్కొన్నప్పుడూ నీకూ అహంకారానికీ అనుబంధం వుంది. జాగ్రత్ సుషుప్తుల్లో నీ యథార్థస్థితి యేది? నిద్రలో నీవున్నావు. ఆ "నీవే" మెలకువలో ఇప్పుడూ ఉన్నావు. మరి నీకు, సంశయము ఇప్పుడు రావడం ఏమి? నిద్రలో లేకపోవడం ఏమి? ఆ సందేహం అహంకారానికన్నావు. అదే సరి. కాని నీవు అహంకారానివి కాదుగదా? అహంకారం ఆత్మకూ శరీరానికి మధ్యస్థితి. నీవు ఆత్మవు. అహంకారమూలమేదో వెదకు. ఆపైన సంశయాలుంటాయేమో చూడు.

కొంతసేపు అయ్యాక, మళ్ళీ భగవాన్ - శాస్త్రాలననుసరించి దేహానికి కర్మయే కారణమన్నది నీ ప్రశ్నకు సమాధానం. మరి కర్మ ఎట్లు వచ్చింది? పూర్వదేహంనుంచి, అనవలె. దీనికి అంతంలేదు. పరిష్కారానికి సూటిమార్గం కాని అనుమానాలపై ఆధారపడకుండా ఎదురుప్రశ్నవేయి. 'అదెవరి కర్మ? ఎవరి దేహం?' అని. అందుచేతనే నీకుపై విధంగా నేను నీకు సమాధానమిచ్చేను. ఇది ఎక్కువ ప్రయోజనకారి.

## భాషణము 502

శ్రీ రాజేంద్రప్రసాద్, శ్రీ జమ్నాలాల్ బజాజ్, వారి అనుయాయియూలూ శ్రీమహర్షిని చూడవచ్చారు.

తర్వాత రెండోరోజు 16 ఆగష్టు 1938న శ్రీ బజాజ్ ప్రశ్నలడిగిరి.

భక్తుడు: మనస్సును సరిగా నిశ్చలంగా సద్బుద్ధితో నిలిపేదెలా?

మహర్షి: ప్రతిప్రాణికీ తన పరిసరాలు తెలుసు. అందువలన అన్ని ప్రాణులలోనూ బుద్ధి ఉందని ఊహించవలసిఉంది. కాని మానవుని బుద్ధికి ఇతర జంతువులబుద్ధికి మధ్యభేదముంది. అతడు పరిసరాలు తెలిసి, అనుగుణంగా నడవడంతో ఊరుకోడు. ఉన్నస్థితితో తృప్తిజెందక కోరికలు పెంచుకొని వానిని తీర్చుకోయత్నిస్తాడు. అందుకై తన దృష్టిని విస్తరింపచేస్తాడు. కాని ఎంతకూ వానికి తృప్తి కలుగదు. అప్పుడు మొదలౌతుంది. వాని యోచన, వివేచన.

సుఖశాంతులు శాశ్వతాలు కావలెనన్న కోరిక, స్వభావతః వాని శాశ్వతను సూచిస్తుంది. అందుచేత ఆ కోర్కెగలవాడు. స్వస్వరూపాన్ని (ఆత్మను) అనుసంధించి ఆర్జింప యత్నిస్తాడు. అది దొరికితే అన్నీ దొరికినట్లే.

వివేకంమూలంగానే అట్టి అంతరన్వేషణ సాధ్యము. (పొందదగిన మార్గము) నిరంతర అభ్యాసం తర్వాత తనను కూడా నడిపించే మరేదో ఉత్తమశక్తి కలదని బుద్ధి తెలుసుకుంటుంది. తానుగా ఆ శక్తి నందుకోలేడు. అందుచేత ఒక దశలో బుద్ధి

వ్యాపార మాగిపోతుంది. కాని సర్వశక్తి ఒంటరిగా మిగిలే ఉంటుంది. అదే ఆత్మసిద్ధి, ఆత్మానుభవము, పరమము, గమ్యమూ.

బుద్ధి తానస్వతంత్రయనీ, మహత్తరశక్తిపై ఆధారపడియున్నాననీ, దానిని తానందుకోనేరననీ తెలియడమే, వివేక ప్రయోజనము. కాబట్టి గమ్య ప్రాప్తికి ముందు బుద్ధి తననుతాను నశింపచేసుకోవాలి.

భక్తుడు: ఒక శ్లోకం - "నాకేరాజ్యాదులు అక్కరలేదు. సంతతము నిన్ను సేవించనీ. అదే నాకు పరమానంద"మని యుంది. అది సరియేనా?

మహర్షి: అవును. కర్తకు భిన్నంగా విషయమున్నంతవరకూ (ద్వంద్వభావన ఉన్నవరకు) కోరిక ఉంటుంది. విషయం లేకుంటే కోరికాలేదు. కోరికలేని స్థితియే మోక్షం. నిద్రలో ద్వంద్వభావనాలేదు, కోరికాలేదు. మెలుకువలో ద్వైతముంది,

కోరిక కూడా ఉంది. ద్వంద్వభావన ఉంది కనుక. విషయసంపాదనకై వాంఛ జనిస్తుంది. అదే బహిః ప్రవృత్తమైన మనస్సు ద్వంద్వభావనకూ కోర్కెకు మూలము. ఆనందమాత్మకభిన్నమని తెలిసినపుడు మనస్సు అంతర్ముఖమౌతుంది. ఆత్మనందుకొంటే సర్వవాంఛలూ తీరినట్లే. బృహదారణ్యకోపనిషత్తులో చెప్పిన 'ఆప్తకామః ఆత్మకామః, అకామశ్చ' అదే మోక్షము.

జమనాలాల్ బజాజ్ ఇక్కడ అందుకొని, సద్బుద్ధి యనడంలో తాను బుద్ధి నుద్దేశించలేదన్నారు. ఋజువూ సక్రమమూ అని తానెన్నిన లక్ష్యంనుంచి చలించని మనోదృఢతనే ఊహించాననీ, దాన్ని సాధించడమెట్లో తెలుపమన్నారు.

మ: పరమగమ్యప్రాప్తికి కావలసింది వ్యక్తిత్వనాశనం. బుద్ధి వ్యక్తిత్వముతో సమానముగా విస్తరించి ఉంటుంది. అది సద్బుద్ధికాని, దుర్బుద్ధి కాని, సి. వ్యక్తిత్వనష్టమైతే బుద్ధి నష్టమూ తప్పదు. అందువలన ఆ ప్రశ్న ఉదయించదు.

భ: అల్లే అయినా, ప్రతివాడూ శ్రేయమెరిగి, సన్మార్గమవలంబించి, సిద్ధర్మాచరణంలో సుస్థిరుడుకావలెగదా? లేకుంటే వానికి దుర్గతియే కదా!

మ: సన్మార్గమవలంబించి, అందుండి విచలితుడుగాకుంటే, బలం తానే పుంజుకొంటుంది.

భ: మార్గంలో ఎన్నో కష్టాలు కల్గుతుంటాయి. తన మార్గాన్ని చుట్టుముట్టిన ఆటంకాలను దాటడానికి అవసరమైన బలాన్ని పొందడమెలా?

మ: భక్తివలన, సాధుసాంగత్యము వలన.

భ: మోక్షానికి ముఖ్య పూర్వాంగంగా వ్యక్తిత్వనాశాన్ని తెలిపారు. ఇప్పుడు భక్తి, సాధుసాంగత్యం పద్ధతులుగా సూచిస్తున్నారు. ఈ రెంటిలో 'నేను సత్సంగిననీ, నేను సద్భక్తుడనీ' వ్యక్తిత్వ స్ఫూర్తిలేదా?

మ: ఈ పద్ధతులు సాధకునికి చెప్పబడ్డాయి. వానికింకా వ్యక్తిత్వ నష్టం కాలేదు. A అయ్యుంటే ఈ ప్రశ్నేరాదు. మార్గనిర్దేశము సాధకుని వ్యక్తినాశనానికై చెప్పబడింది. అందుచేత అది సరియైనదే.

భ: స్వరాజ్యాభిలాష సరియైనదేనా?

మ: అట్టికోరిక నిస్సందేహంగా స్వార్థంతో మొదలవుతుంది. అయినా గమ్యాన్ని సాధించేయత్నంలో దృష్టి విశాలమై వ్యక్తి దేశంలో మగ్నుడౌతాడు. అట్టి వ్యక్తిత్వ మగ్నత మంచిదే. దానికి సంబంధించిన కర్మ నిష్కామమౌతుంది.

భ: చాలకాలం పోరాడి, ఎన్నెన్నో త్యాగాలు చేసిన పిదప స్వరాజ్యం లభిస్తే, ఆ లాభంవల్ల వ్యక్తికి హర్షోత్కర్షలు కల్గడం సహజమే గదా?

మ: అట్టి ప్రయత్నకాలంలో అతడేదో మహత్తరశక్తికి తన్నర్పణం చేసుకొని యుంటాడు. ఆ శక్తిని గుర్తుంచుకొని ఎప్పుడూ మరువగూడదు. అది జ్ఞప్తియుంటే వానికి ఉత్కర్ష ఎట్లు వస్తుంది? వాని కర్మ ఫలితాలను గూడా లెక్కపెట్ట చూడకూడదు. అపుడే అది నిస్వార్థకర్మమవుతుంది.

భః ఉద్యమంలో పనిచేసేవాని సత్యశీలం సడలనీయని ఉపాయమేమైన ఉన్నదా?

మ: అతడు తన్ను దైవానికో, గురువుకో అర్పణం చేసుకుంటే, ఆ దైవమో గురువో వానిని సరియైన దారిసే నడిపిస్తాడు. అది సన్మార్గమా కాదాయని అతడాలోచింప వలసిన పనిలేదు. అన్ని అంశాల్లోనూ గురువు ననుసరింపకపోతేసే ఈ సందేహం కల్గేది.

భ: దేశానికై శ్రమించి స్వరాజ్యం సంపాదింపగల్గిన ధైర్యస్థైర్యాలను, తన భక్తుల కనుగ్రహింపగల్గిన శక్తియేదైనా ఈ భూతలంలో ఉన్నదా?

(మహర్షి మౌనం వహించారు. ఆ తర్వాత అట్టి శక్తి యున్నదసే ఆ మౌనాని కర్థమన్నారు.)

భ: ఈ దేశానికి చెందిన పూర్వమహాత్ముల తపస్య నేటి వారివారసుల శుభానికై లభ్యం కాదా?

మ: లభ్యమే; కాని ఒకటి మరవరాదు, ఏ ఒక్కడూ తాను మాత్రమే వారసుడననుకోరాదు. లాభాలందరికీ సమానంగా దొరుకుతాయి? (కొంతసేపాగి) అట్టి తపస్సు అనుగ్రహించకుండానే ప్రస్తుత జాగృతి వచ్చిందా?

(భగవానన్నారు - 1896లో తాము తిరువణ్ణామలై రాకపూర్వం స్పష్టమైన యే రాజకీయచింతనా లేదు. దాదాభాయినౌరోజి ఒక్కరే పార్లమెంటు సభ్యుడుగా ఉండిరి.)

ఆ పిదప జమ్నాలాల్ బజాజ్ పలికారు - శ్రీరాజేంద్రప్రసాద్ ఉత్తముడు, నిస్వార్థియైన దేశభక్తుడు. ఎంతో ఆర్జనగల తన వృత్తిని దేశానికై త్యాగం చేసాడు. దేశానికట్టివారు కావలసియున్నది. కాని ఆయన ఆరోగ్యం సరిగా లేదు. ఆయన ఒంట్లో బలం బొత్తిగా లేదు. ఏదో ఒక వ్యాధితో బాధపడుతూనే ఉంటారు. అటువంటి ఉదాత్తమగు దేశపుత్రునికా ఇలాంటి కష్టాలు? (శ్రీభగవాన్ కరుణార్ధంగా మందహాసం చేసారు.)

## భాషణములు 503

ఒక అమెరికా దేశస్థుడు, జె.యం. లోరీ, రెండు నెలలుగా ఆశ్రమంలో ఉన్నాడు. అతడడిగాడు.

భక్తుడు: నేనీ రాత్రికి వెళ్ళుతున్నాను. ఇక్కడనుంచి విడిచిపోవడం కష్టంగా ఉంది. కాని నేనమెరికా వెళ్ళవల్సిందే. సద్గురుసందేశాన్నర్థిస్తున్నాను. నాకంటే సద్గురువులకే నన్నెక్కువ తెలుసు. కాబట్టి నేను వారికి దూరంగా ఉన్నరోజుల్లో నన్నాదుకునేందుకై సందేశమడుగుతున్నాను.

మహర్షి: సద్గురువు నీవనుకొనేట్లు నీకు వెలిగా లేడు, నీలోనే ఉన్నాడు. నిజానికతడు నీ ఆత్మయే. ఆ సత్యాన్ని గ్రహించు. నీలో వెదకి అతన్ని కనిపెట్టు. అప్పుడాయనతో ఎల్లప్పుడూ సంపర్కముంటుంది. సందేశమూ ఎప్పుడూ ఉన్నదే. అది మౌనంగా ఎప్పుడూ లేదు; నిన్నెప్పుడూ వదలదు. గురువుకు దూరంగా నీవెప్పుడూ వెళ్ళనూ లేవు.

నీ మనస్సు బయటకు పోతుంది. ఆ ప్రవృత్తివల్ల అది విషయాలను వెలుపలిగనే చూస్తుంది. అందులో గురువూ ఒకరు. కాని నిజం వేరు. గురువే ఆత్మ. మనస్సు నంతర్ముఖం చేయి. అప్పుడు విషయాలు నీలోనే కనిపిస్తాయి. గురువే ఆత్మయనీ, అతడే తప్ప వేరేమీ లేవని తెలుసుకొంటావు.

నిన్ను దేహంగా భావిస్తావు గనుక, విషయములు నీకు వెలివేయని నిశ్చయిస్తావు. కాని నీవు దేహమా? కావే! నీవాత్మవు. సకల విషయాలూ సర్వప్రపంచమూ ఆత్మయందే ఉన్నవి. ఆత్మను తప్పిపోగలది ఏదీ లేదు. నీఆత్మయేయైన గురువుకు నీవు దూరమెట్లు పోగలవు? నీ దేహం ఒకచోటినుండి మరోచోటికి కదలిపోతుంది. గాని ఆత్మకది దూరంపోతుందా? అలాగే గురువు లేకుండా నీవెప్పుడూ ఉండవు.

మహర్షి పద్ధతులతో పరిచయమున్నా లోరీ ఈ సమాధానానికి చకితుడైనాడు. అతడు ద్విగ్నుడైనాడు. వారి అనుగ్రహం నిరంతమూ తన ఎడల ఉంచమని ప్రార్థించాడు.

మహర్షి: గురువు ఆత్మ కాబట్టి అనుగ్రహము ఆత్మకు భిన్నం కాదు.

లోరీ అత్యంత భక్తిభరితుడై మహర్షికి నమస్కరించి సత్యాన్నెరిగే శక్తినిమ్మని అర్థించాడు.

మహర్షి: ఆత్మసిద్ధిలేని క్షణమెరుగుదువా? ఆత్మకు వేరుగా ఎప్పుడైనా ఉండగలవా. నీవెప్పుడునూ ఆత్మయే.

భ: మీరు సద్గురువులు ప్రపంచమెల్లెడలా సంతోషానందాలను విరజిమ్ముతున్నారు. మీ ప్రేమ అపారము. కావుననే మానవ రూపంలో ఈ భూమిపై అవతరించారు. నేనెరుగగోరేదిది. దేశోపకారమును, ప్రజా నాయకత్వానికి పూనుకోక పూర్వం, విధిగా ఆత్మను సాధించనేవలెనా?

మ: మొదట ఆత్మసిద్ధి కానీ. ఇతరాలన్నీ అవే వెంటవస్తాయి.

భ: పరిశ్రమలలో, మెకానికల్ ఇంజనీరింగ్లో, భౌతిక శాస్త్రాదుల్లో లోకవ్యవహారాలన్నింటిలో అమెరికా అగ్రస్థానం వహించియుంది. అట్టిస్థితి నది ఆధ్యాత్మికంగా గూడ అందుకోగలదా?

మ: తప్పక వచ్చితీరుతుంది.

భ: దైవం వర్ధిల్లుగాక, తథాస్తు. ఒక ఇంజనీరింగ్ కంపెనీలో నేను భాగస్థుణ్ణి. నా దృష్టి కదేమంత ప్రముఖంకాదు. నా కంపెనీ దినదిన వ్యవహారాలలో ఆధ్యాత్మిక ప్రమాణాలను తీసుకురావాలని చూస్తాను.

మ: అది మంచిదే. భగవచ్ఛక్తికి నిన్నర్పించుకో, అంతా సరిగనే జరుగుతుంది. ఆ శక్తియే సర్వమూ చూసుకొంటుంది. నీవు కర్తవనుకుంటే, నీ కర్మఫలాలనుభవింపక తప్పదు. అట్లుగాక దైవార్పణమంటివా, ఆ శక్తికి నీవుపకరణమాత్రంగా మెలుగుతావు. నీ కార్యాలన్నీ, వానిఫలితాలతోసహా, ఆ శక్తియే తనమీద వేసుకుంటుంది. అవి నిన్ను బాధించవు. పనియేమో ఏ అడ్డూలేక సాగిపోతుంది. నీవాశక్తిని గుర్తించినా, గుర్తింపకపోయినా, విధివిధానాల్లో మార్పేమీ ఉండదు. ఉండేది నీ దృష్టిభేదమే. రైలుబండిలో పయనిస్తూ, నెత్తిపై నీకు మోపెందుకు? బరువు నీనెత్తిపైనున్నా, బండిలో ఉన్నా, నీతో సహా బరువునూ రైలుబండి లాగేస్తుంది. నెత్తిపై నుంచుకొంటే నీవు అనవసరంగా కష్టపడతావు. బండికి ఏమైనా బరువు తగ్గుతుందా? ప్రపంచంలో వ్యక్తుల కర్తృత్వభావన అలాంటిదే.

భ: ఇరవై ఏళ్ళుగా వేదాంత అధ్యయన చేస్తున్నాను. ఎందరో, ఏవేవో అనుభూతులు పొందామంటారు. నాకేకొత్త అనుభవాలూ కలుగలేదు. దూరశ్రవణం, దూరదర్శనం లాంటి సిద్ధులూ ఎరుగను. ఈ దేహంలో బందీలా అనిపిస్తుంది. అంతకుమించి మరేమీకాలేదు.

మ: అది సరి. సత్యమొకటే, అదే ఆత్మ. సకలమూ దానిలోని సంకల్పాలే, అందుండివచ్చినవే. అది చేసినవే. దృష్టి, ద్రష్ట, దృశ్యము, అన్నీ ఆత్మయే. ఆత్మను ప్రక్కకు నెట్టి, ఎవడైనా చూడగలడా? వినగలడా? ఆ వినడం, చూడటం దగ్గరగానైతేనేం, సుదూరంగానైతేనేం. రెండు సందర్భాల్లోనూ, చూచే వినే అవయవాల అవసరం ఉండనే ఉంది. వాని రెంటినీ విడనాడలేవు. అలాగే మనస్సుకు కావాలి. విధం ఏదైతేనేం, వానిపై ఆధారపడక తప్పదు. అటువంటప్పుడు దూరశ్రవణ దూరదర్శనాదుల వ్యామోహమెందుకు?

అదీగాక లభ్యమైనది నష్టమూ అవుతుంది. అది శాశ్వతం కాదు.

శాశ్వతమైనది సత్యమొకటే. నేనున్నాను, నేను వెడుతున్నాను, నేను మాట్లాడుతున్నాను, నేను పనిచేస్తాను - ఇట్లెన్నెన్నో అంటావు. ఆ అన్నిటిలో 'నేను' సమమని గుర్తించు. 'నేను ఉన్నాను' అనేదే స్థిరమూ ప్రధానమూ అయిన సత్యం. దైవం మోసెస్కు బోధించారు- 'నేనున్నానదిగా నేనున్నాను' (I am that I am). 'నిశ్చలంగా ఉండు, నేను దైవమని తెలుసుకో'. ఇట్లు 'నేను - ఉన్నాను' అదే దైవము.

నీవున్నావని నీకు తెలుసు. లేవని ఎప్పుడూ అనలేవు; లేవనడానికి గూడ నీవు ఉండాలి కాబట్టి. ఈ కేవల స్థితి నీ మనస్సు నిశ్చలమైతేనే తెలియనౌతుంది. వ్యక్తి వెలికి నిర్గమించే శక్తియే మనస్సు. దానిని లోనికి మళ్ళిస్తే క్రమంగా అది స్తబ్ధమౌతుంది. 'ఆత్మస్థితి' - నేను - ఉన్నాను' మిగులుతుంది. 'నేను ఉన్నాను' అదే సత్యసర్వము.

భ: ఈ విపుల వివరణం నాకెంతో బహుమతంగా ఉంది. మహర్షి: 'బహుమానించే దెవరు? దేనిని?'

హృదయాన్ని గూర్చి భగవాన్ ఒక మాటన్నారు. 'కుడిఎడమల మాట అవతల పెట్టు. అవి దేహగతాలు. హృదయం ఆత్మ. దాన్ని సిద్ధింప చేసుకో. అప్పుడు నీవే తెలిసికొంటావు. లోరీ నమస్కరించి వెళ్ళిపోయాడు.

## భాషణములు 504

ఒకరు శ్రీఅరవిందుల పరిభాషలోని అతిమానస (over mind), అధిమానస అహంకార (The psychic), పరమార్థ (The Divine) యివి యేమిటన్నారు? మ: దైవాన్ని, అంటే ఆత్మను సాధించుకో. ఈ భేదాలన్నీ మాయమౌతాయి.

## భాషణములు 505

బాబు రాజేంద్రప్రసాద్: నేనిచ్చటికి మహాత్మాగాంధీజీ అనుమతితో వచ్చాను. త్వరలో ఆయన యొద్దకు తిరిగిపోవలె. శ్రీభగవాన్ వారికేదైనా సందేశమిస్తారా? మహర్షి: ఆయనలో ఆధ్యాత్మశక్తి పనిచేస్తూ ఆయన్ను నడుపుతోంది. అంతకన్న కావలసిందేముంది.

## భాషణములు 506

'సద్విద్య'లోని మొదటి పద్యాన్ని భగవాన్ వివరించారు - 'సత్ స్థితి (ఉండుట) అదే చిత్ (శుద్ధ చైతన్యము). 'చిత్' గూడ 'సత్యమే'. ఉన్నది ఒకటే. కాకపోతే తన ఉనికి, ప్రపంచపు ఉనికి తెలియ సాధ్యమే కాదు. అది ఉనికినీ, జ్ఞానాన్ని కూడ సూచిస్తుంది. ఇంతకూ ఆ రెండూ అభిన్నాలు, ఒకటే. మాటవరసకు 'చిత్' కాని 'సత్' అనుకుందాం. అపుడా 'సత్' జడమయి కూర్చుంటుంది. దాన్ని తెలుసుకోవటానికి వేరే 'చిత్' ఒకటి అవసరమౌతుంది. ఆ రెండో 'చిత్', 'సత్'కు భిన్నం కాబట్టి దానికి కాని ఉనికి లేకుండా ఎలా? ఇప్పుడు 'చిత్' ను 'సత్'గా తీసుకుంటే ఆ 'సత్' జడం, అంటే 'చిత్' కూడా జడం అయిపోతుంది. దానికి అర్థం లేదు. దానిని తెలిసికోడానికి ఇంకొక 'చిత్' కావాలి. అది కూడ అర్థం లేని విషయమే.

కాబట్టి సత్తు చిత్తులూ రెండూ ఒక్కటే, సదృశములే.

భాషణములు 507

బెంగుళూరునుండి ఒక ఆర్యసమాజ సభ్యుడు, మిత్రునితో కలిసి మహర్షిని చూడవచ్చాడు.

భక్తుడు: యోగాభ్యాస ప్రయోజనం ఏమి? స్వార్థానికా, లోక కల్యాణానికా?

మహర్షి: యోగం అంటే రెంటి కలయిక. అవియేవో విచారించు. ప్రయోజనమూ, కల్యాణమూ ఎవరికో, దేనికో, అది కనుక్కో

భ: వర్ణ (కాస్ట్) భేదాలుండాలా?

మ: వ్యత్యాసం చూచెదెవరు? అది వెదకు.

భ ఆశ్రమంలో వర్ణభేదం పాటిస్తున్నారు. బహుశః భగవాన్ సమ్మతిలేకనే

వారట్లు చేస్తున్నారనుకొంటాను.

మ: ఇతరుల గూర్చి మాట్లాడటానికి నీవెవరు? ఆ ఇతరులు నిద్రలో నీకగపడ్డారా?

భ: ఇచట వ్యక్తిత్వం నాది, నిద్రలో నేనితరులను చూడకపోవచ్చు. కాని ఇప్పుడు చూస్తున్నాను గదా?

మ: చూస్తున్నావు. నిజమే. కాని ఇప్పుడు చూస్తున్న నీవు, నిద్రలో చూడని నీవు ఒకరే, ఆ వ్యక్తే. ఈ భేదాల నిప్పుడు చూడడమెందుకు, బాధపడట మెందుకు? నిద్రలో ఉన్నట్లు ఇప్పుడు వుండు.

భ: అది వీలు కాదు. నేనది ఇప్పుడు చూచాను, నిద్రలో చూడను. కాని అందువలన ఉన్న పరిస్థితులు మారవు.

మ: కర్తలేక విషయాలుంటాయా?

భ: అవి కర్తతో సంబంధం లేకనే ఉండగలవు.

మ: అట్లని అనేది నీవా, లేక అవే వచ్చి నీకు ప్రకటిస్తున్నవా?

భ: అవి ఉన్నవని నాకు తెలుసు.

మ: కాబట్టి అవి నీ ఎరుకను బట్టియే. వాని స్వయంస్థితి కాదు,

భ: నేనెరుగకున్నా అవి ఉండనే ఉంటాయి.

మ: అవి ఉన్నవని నీకు తెలియకుండానే చెప్తావా. (నవ్వు)

భ: బ్రహ్మమందరికీ సముడే. అక్కడ ఏ భేదభావమూ లేదు. వర్ణవ్యత్యాసము ఉత్తమాచరణకు విరుద్ధము.

మ: ఇందులోకి బ్రహ్మమునెందు కీడుస్తావు? ఆయన కిట్టి బాధలేవీ లేవు. నొచ్చినవాడే ఏం చేయాలో చూసుకోవాలి.

భ: మీరు మహాత్ములు. వర్ణభేదాలు మీరొప్పరు. కాని ఇచటివారు ఆ భేదాలు ఎలా విధిస్తారు?

మ: నేను జ్ఞానినని, మహాత్ముడనని నేను నీకు చెప్పానా? అట్లని నీవే కదా అంటున్నావు. వర్ణవిషయంలోనూ నేనేమి ఫిర్యాదు చెయ్యలేదు.

భ: పరమాత్మ అందరిలోనూ ఒక్కడే.

మ: ఆ పేర్లన్నీ తేవడమెందుకు? వాళ్ళవిషయం వాళ్ళు చూసుకొంటారు. వారి కెవరిసాయం అక్కరలేదు.

భ: మహాత్మగాంధికూడ సమత న ప్పుకుంటారు.

మ: గాంధి ఇక్కడ లేరు.

భ: అరవిందులు వర్ణభేదా లంగీకరించరు. మీరు సమ్మతిస్తారా?

మహర్షి: అరవిందులు విషయం ఆయన్నడుగు. నా అభిప్రాయమా? దానితో

నీకేం పని? దానివల్ల నీకేం ప్రయోజనం? ఆ విషయంలో నీకొక స్వంత అభిప్రాయమున్నదా? అదొక్కటే నీ ప్రమేయం, ఇతరుల అభిప్రాయాలు కావు. భ: వర్ణవ్యవస్థ నేనొప్పను. మహాత్ముల అభిప్రాయము మార్గదర్శకంగా ఉపయోగిస్తుంది. నా ప్రయత్నమునకై మీ యాశీర్వాద మభిలషిస్తున్నాను.

మ: మహాత్ముడు నిన్ను నీవన్వేషించి తెలుసుకొమ్మని చెప్పేడు. అది నీవు చేయవు. ఆశీర్వాదాలు కావాలి.

భ: నేనాబోధ ననుసరించ యత్నిస్తున్నాను. కాని వర్ణవిభేదం చాల బాధాకరంగా వుంది. అది పోవాలి.

మ: ఎవరినది బాధిస్తున్నది?

భ: ఈ సంఘంలోని సభ్యులను

మ: అని నీవంటావు. అట్టి వర్ణవిభేదాలే లేని దేశాలున్నవి. వారికే క్లిష్టసమస్యలు లేవా? యుద్ధాలు, అంతఃకలహాలులేవా? అక్కడి చెడ్డను తొలగించరాదా?

భ: అట్టి సమస్య లిక్కడా ఉన్నవి.

మ: భేదా లెప్పుడూ ఉన్నవే. ఉండేది మానవులేగాదు, పశువులు, మొక్కలూ, మరెన్నో. పరిస్థితులు మనచేతిలోనివి గావు.

భ: ప్రస్తుతం జంతువుల విషయం తీసుకోవడం లేదు.

మ: ఏం ఎందుకని? వానికి నోరుంటే నీతో తామూ సమానమని వాదించవా? ఆ పని నవి మానవులకన్నా మరీ గట్టిగా చేయగలవు?

భ: కాని వానివిషయంలో మనం చేయగల్గిందేదీ లేదు. అది దైవకృతం.

మ: అది దైవకృతమైతే, తదితరమంతా నీ కృతమా? అలాగునా?

భ: ఈ భేదాన్ని మానవుడే కల్పించాడు.

మ: ఈ భేదాలను గుర్తించవలసిన పనిలేదు. ప్రపంచంలో విభిన్నత ఉంది. ఈ విభిన్నతలో అంతస్సూత్యంగా ఏకత ఉంది. అందరిలోనూ ఆత్మ ఒక్కటే. తత్త్వంలో భేదం లేదు. భేదాలన్నీ బాహిరాలు. పైపైవి. ఆ ఏకతను కనుగొని సంతోషంగా ఉండు.

భేదజ్ఞానమిచ్చే బాధను ఏకతాజ్ఞానం కూర్చే సుఖం తొలగిస్తుంది. రాజు భృత్యుని వేషం ధరించవచ్చు. కాని వ్యక్తిలో మార్పుఏమీ ఉండదు.

భ: నేను భేదాన్ని కాదనడం లేదు. కాని ఒకరు మరొకరికంటే ఎక్కువనే భావం చాల తప్పు.

మ: భేదాలు మనిషి అంగాల్లోనే ఉన్నాయి. చేయి కాలికి తాకినప్పుడది మైలపడదు. ప్రతి అవయవమూ దానిదాని పనిచేస్తుంది. భేదాలకు నీ అభ్యంతరమేమి?

భ: వర్ణభేదం అన్యాయమని ప్రజలు భావిస్తున్నారు. దాన్ని నిర్మూలించాల్సిందే?

మ: వ్యక్తిగతంగా నీవాభేదాలు చూడనిస్థితికి రావచ్చు. సంతోషంగా ఉండవచ్చు. ప్రపంచాన్ని బాగుచేయగలననే ఆశ ఎలా సాధ్యం? నీవెంత యత్నించినా అది సాధ్యంకాదు. కావ్యకంఠ గణపతి శాస్త్రి హరిజనులకు మంత్రములను ఇచ్చి బ్రాహ్మణులను చేస్తానన్నారు. కాని ఒప్పుకొని వారెవరూ ముందుకు రాలేదు. అంటే వారిలో వారికే తాము తక్కువనే భావం గాఢంగా ఉన్నదన్న మాట. ఆ భావాన్ని మొదట తీసివెయ్యి. ఆ తరువాత సంస్కరిద్దువుగాని. అదీగాక ఆ భేదాలు పాటించే ఆ స్థలాలకెళ్లపోయి బాధపడడమెందుకు? అవి లేని చోట హాయిగా ఉండరాదా?

గాంధీజీ కూడ సమత నెలకొల్పవలెననే చూస్తున్నారు. దిగువ వర్ణులలో తాము తక్కువనే భావాన్ని ఆయన ఎదుర్కొనవలసి వస్తున్నది. ఆయన తన అభిప్రాయాలను ఇతరులపై రుద్దలేరు. ఆయన అహింసావలంబి. అందువలన పరిస్థితులు అన్నీ అలాగే ఉన్నాయి.

భ: వర్ణభేదం నిర్మూలించడాని కందరూ ప్రయత్నించాలి.

మ: అయితే చెయ్యి. ప్రపంచ విషయంలో నీవది సాధిస్తే అప్పుడిక్కడ ఆ భేదాలుంటాయేమో చూడు.

భ: ఆ సంస్కరణను ఇక్కడే ఆరంభించాలి అనుకుంటున్నాను.

మ: సంస్కరణాలకై ఎందుకంత శ్రమిస్తావు. నిద్రపోయి చూడు. అక్కడ భేదాలు ఉన్నాయేమో. అన్ని భేదాలను నీవు నిర్మూలించేస్తావు. ఎటువంటి ప్రయత్నం లేకుండా. (నవ్వులు)

## భాషణములు 508

ఒక భారతీయ ఐ.సి.ఎస్. ఆఫీసరు హాలులో కొన్ని గంటలుగ కూర్చుని ఉన్నారు. ఆయన అడిగారు.

భక్తుడు: అహింస ప్రపంచంలోని యుద్ధాలని అంతం చేస్తుందా?

శ్రీ భగవాన్ బదులీయలేదు. అప్పుడు సాయంత్రం బయట నడవడానికి టైమ్ అయింది. మరుసటిరోజు ఎవ్వరో ఆ ప్రశ్ననే తిరిగివేసారు. భగవాన్ ఆ ప్రశ్నలోనే సమాధానం ఉంది అన్నారు. పూర్ణమైన అహింస నెలకొంటే యుద్ధాలుండవని వేరే చెప్పాలా?

## భాషణములు 509

శ్రీమాకైవర్ శ్రీభగవాన్ తో మాట్లాడుతూ దీక్షా విషయం ప్రస్తావించాడు. మహర్షి: ఈ దీక్ష ఏమి? (కొంత ఆగి) దీక్ష పలువిధాలు వాక్, దృక్, స్పర్శాదులు.

భక్తుడు: శ్రీ భగవానులది మౌనదీక్ష అవునా?

మ: అవును, దీక్ష లన్నిటిలో అది ఉత్తమము.

భ: అది విచారమార్గానికి మాత్రమే పరిమితమా?

మ: అన్ని మార్గాలు విచారమార్గంలోనే ఇమిడినవే.

భ: కాని ఆ దీక్షలను వేర్వేరుగా తీసుకొంటే, వాటికది వర్తిస్తుందా?

మ: వర్తించదు.

భ: ఆత్మలబ్ధికై సహాయం కావాలనుకొనేవారికి ఈ దీక్షలు సహాయకాలు కావా?

మ: సహాయకారే,

భ: ఈ దీక్షలు తీసుకోవడానికి వేర్వేరు వ్రతాలవలంబించాలా?

మ: అవును.

భ: దీనిపై మరొక ప్రశ్న వస్తుంది. "నేను భగవాన్ చరణ సన్నిధిలో ఉన్నంత కాలము నేను నన్ను శుద్ధ క్రైస్తువుణ్ణి అనుకో వీలుగాదు."

శ్రీభగవాన్ మాటకు అడ్డువచ్చి "ఇది క్రైస్తవమతసారము" అన్నారు.

భ: నిజమే. కాని నేటి చర్చి ప్రతినిధుల దృష్టిలో గాదు. అందువల్ల చర్చివలన నే నెట్టి సాయం ఎదురుచూడడానికి వీలుపడదు. వేరే ఆశ్రయాలకై అన్వేషణను శ్రీభగవాన్ అనుమతిస్తారా?

మ: అది నీ ఇష్టం.

కొంత ఆగి భగవాన్ మరికొంత ప్రసంగించారు. దాని సారం ఇది - “ఇచ్చటికి ఫోన వచ్చినవారి నందరినీ ఏదో దుర్జ్ఞేయశక్తి కొనివచ్చింది. వారి బాగోగులా శక్తి చూచుకొంటుంది." దానితో ఈ సంవాదం ముగిసింది.

## భాషణములు 510

శ్రీ టి.కె. సుందరేశ అయ్యర్ ఏదో ఒక పుస్తకం నుంచి చదవనారంభించారు. దానిలో అంతఃకరణాన్ని ఐదుగా విభజించి యుంది. 1. ఉళ్ళం. 2. మనస్సు, 3. బుద్ధి, 4. చిత్తం, 5. అహంకారం.

శ్రీభగవాన్ అన్నారు - సాధారణంగా నాల్గింటినే గుర్తిస్తారు. కాని ' ఉళ్ళం' అని అయిదోదాన్ని చేర్చడం పంచ తత్త్వాలతో పోల్చడానికే.

1. ఉళ్ళం - చైతన్యం. ఇది ఆకాశతత్త్వము. కపాలం నుంచి కనుబొమల వరకు.

2. మనస్సు - ఆలోచనా శక్తి. ఇది వాయుతత్త్వము, కనుబొమలనుండి గొంతువరకు.

3. బుద్ధి - వివేకము. అగ్నితత్త్వము - గొంతునుండి గుండెవరకు.

4. చిత్తం - జ్ఞప్తి, జలతత్త్వము, గుండెనుండి నాభివరకు. 5. అహంకారము - పృథ్వీతత్త్వము - నాభినుండి మూలాధారం వరకు.

ఉళ్ళమంటే శుద్ధమనస్సు, అది మానసాకాశం. అంటే ఆలోచనలు క్రమ్ముకొనని మనోవిస్తారం. నిద్రనుంచి లేవగానే తలకూడా పైకిలేచి అందులో చైతన్యకాంతి ప్రతిఫలిస్తుంది. ఆ తేజం పూర్వం నుంచీ హృదయంలో ఉన్నదే. అది మెదడు చైతన్యంగా ప్రతిఫలిస్తుంది. కాని దీనికి ప్రత్యేక వైశిష్ట్యం అహంకారస్ఫూర్తికి తరువాతనే. నిర్వికల్ప స్థితికి దీనిని విశ్వమానసమనో, విశ్వచైతన్యమనో అంటారు. ఈ స్థితియే నిమిషమో అత్యల్పకాల ముంటుంది. దీనిలో అహంకారం చొచ్చుకొన్నప్పుడు అది సగుణమూ, సవికల్పమూ అయి, 'నే'నన్న పలుకు ఉదయిస్తుంది. ఇది ఎప్పుడూ ఒక వ్యక్తిపరంగా లేదా ఒక ఉనికి పరంగా వ్యక్తమౌతుంది. అట్లు దేహమే నేనన్న భావం కలుగుతుంది. దాని పర్యవసానంగా మిగిలినదంతా.

ఉళ్ళం ప్రతిబింబిత కాంతి గనుక, దానిని చంద్రుడన్నారు. మూలకాంతి హృదయంలో ఉన్నది. అందుకే హృదయాన్ని సూర్యసమంగా చూస్తారు.

## భాషణములు 511

“నకర్మణా న ప్రజయా ...” మంత్రాన్ని మేజర్ చాడ్విక్ ఇంగ్లీషులోని కనువదించారు. శ్రీభగవాన్ దానిని వివరిస్తున్నారు. "బ్రహ్మలోకం" అంటే భావనాపరంగాను, వస్తువిషయకంగాను అర్థం చేసుకోవచ్చు. ఈ రెండవ పద్ధతిలోనైతే మన శాస్త్రాల్లో నమ్మకముండాలి. అవి 'లోకముల'ను ప్రస్తావిస్తాయి.

ఆ మొదటిది స్వానుభవానికి చెందింది. దానికెట్టి బాహ్యప్రమాణమూ అక్కరలేదు.

బ్రహ్మలోకం అంటే బ్రహ్మజ్ఞానం. అదే ఆత్మసాక్షాత్కారము. అపరాంతకాలానికి

భిన్నమగు పరాంతకాలము. అపరాంతకాలంలో పునర్జన్మ లెత్తుతూ జీవులు విస్మృతులౌతారు. ఆ విస్మృతి అవిద్యలో అంతరితమౌతుంది. 'పరా'దేహాతీతము. 'పరాంతకాల'మంటే దేహాధి గమనము, అంటే జ్ఞానము. పరామృతాత్ - ప్రకృతేః, ప్రకృతికవ్వల, 'సర్వే' అనటంలో అందరూ జ్ఞానానికి మోక్షానికి అర్హులని భావము. 'యతయః' యమ నియమసమేతులైన సత్పురుషులు. ఆ శ్లోకం అసత్యాన్నధిగమించి సత్యస్థితికి చేరడాన్ని సూచిస్తోంది.

"న కర్మణా న ప్రజయాధనేన, త్యాగేన ఏకే అమృతత్వమానశుః పరేణనాకం, నిహితం గుహాయాం విభ్రాజతే యద్యతయో విశంతి, వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః సన్యాసయోగాత్ యతయః శుద్ధసత్వాః తే బ్రహ్మలోకేతు పరాంతకాలే, పరామృతాత్ పరిముచ్యంతి సర్వే. దహ్రం విపాపం పరమేష్మభూతం యత్పుండరీకం పురమధ్య సంస్థం, తత్రాపి దహ్రం గగనం విశోకస్తస్మిన్ యదంతస్త దుపాసితవ్యం యో వేదాదౌ స్వరప్రోక్తో వేదాంతేచ పతిష్ఠితః తస్య ప్రకృతిలీనస్య, యః పరస్సమహేశ్వరః

భావము: అమృతత్త్వము సత్కర్మల చేతగాని, సంతానం ద్వారాగాని, ధనము ద్వారాగాని సాధ్యం కాదు. ఏ ఒక్కరో దానిని త్యాగం ద్వారా సాధిస్తారు. జితేంద్రియులైన ఋషులు సత్తును, ఏదైతే స్వర్గానికి అతీతమైనదో, ఏదైతే హృదయ గుహలో వెలుగుతోందో దానిని పొందుతారు.

అట్టి నిపుణులు (ప్రవీణులు) త్యాగధనులు, ఏకాగ్రచిత్తులు, శుద్ధసత్త్వులు, వేదాంతవిజ్ఞానమునందు స్పష్టమైన అవగాహన గలవారు. వారు ఈ శరీరమును విడిచినపుడు, జన్మకారణమైన మాయనుదాటి, బ్రహ్మలోకాన్ని చేరుతారు.

అదే హృత్ పద్మంలో, దుఃఖరహితమైన సూక్ష్మ ఆకాశంగా వెలుగుతోంది. ఆ నిర్మలమైన పరబ్రహ్మము శరీర మధ్యంలో దహరాకాశమందు వెలుగుతోంది. అదే ఉపాసనకు తగినది. ఆ పరమేశ్వరుడే పరమ ప్రాచీన శబ్దానికి అతీతడు. అతడే వేదములకు ఆద్యంతము. వానియందే ప్రకృతి లీనమగును.

ఆ పిదప శ్రీ టి.కె.ఎస్. అయ్యర్ ముక్తలోకముల గురించి అడిగారు. అవే బ్రహ్మలోకము లన్నారు భగవాన్.

భక్తుడు: అట్టి లోకము జేరుటకు, ప్రణవతనువు శుద్ధ తనువులాంటి సూక్ష్మతనువేదైన కావాలా?

మహర్షి: ప్రణవము యథార్ధ జపము. దానిని అ, ఉ, మ, గా నాదమనీ, బిందువనీ వ్యాఖ్యానిస్తారు. ఆ మొదటి మూటినీ విశ్వ, తైజస, ప్రజ్ఞులుగా, విరాట్టు, హిరణ్యగర్భ, ఈశ్వరులుగా వర్ణిస్తారు. నాదబిందువులు, ప్రాణ మనస్సుకు సమానాలు.

మాండూక్యోపనిషత్తు మూడు మాత్రలను, తురీయ, మాత్రను ప్రస్తావిస్తుంది. దాని సారాంశము, అదే నిజమైన స్థితి అని.

మరొక ప్రశ్నకు సమాధానంగా మహర్షి అన్నారు- పంచపద మహావాక్యము లన్నారు. ఉదా - తత్త్వమసి, అతి నిజం (నీవది అగుట పరమ సత్యం). మొదటి మూడు పదములకు లక్ష్యార్థముంది. వాని తాత్పర్యం కేవల సత్యమే. లేని అవిద్యను నిర్మూలించడానికి ఎన్నో యత్నాలు, ఎంతో నియమనం (అనుశాసనం) కావాలని చెప్పబడింది.

## భాషణములు 512

శ్రీ భగవాన్ వచించారు -

మనశ్చైతన్యాన్ని ఆత్మ చైతన్యంగా అందరూ భ్రమపడతారు. గాఢనిద్రలో మనస్సులేదు; అయినా నిద్రలో తానులేనని ఎవ్వడూ అనడు. లేవగానే, శిశువుగూడ 'బాగానిద్రపోయా'నంటుందే కాని తాను లేననదు. అప్పుడు “నేను” పుట్టి మనస్సు 5 ఇంద్రియముల ద్వారా వెలుపలికి నిర్గమించి విషయాలను తెలుసుకొంటుంది. దీనినే ప్రత్యక్షజ్ఞానం అంటారు. 'నేను' ప్రత్యక్షం కాదా అని అడిగితే వారు తికమకపడతారు. 'నేను' ఒక విషయంగా ఎదుటపడి తన్ను ప్రకటించుకోదు. ఇంద్రియముల ద్వారా చూస్తూగాని వారు దేనినీ ప్రత్యక్షజ్ఞానమనుకోరు. ఈ అలవాటు అంత దృఢంగా ఉంది. యోగులను సంబోధిస్తూ తేవారంలో ఒక పద్యమున్నది "దుఃఖనివృత్తికై తపిస్తున్న మీకు ఉదాహరణలతో, అనుమానాలతో ఆరాటమెందుకు? అంతర్జ్యోతి ప్రకాశం వెలువరిస్తూనే ఉంది. విమల మనస్కులై భగవంతునిలో జీవించండి.”

ప్రత్యక్ష దర్శనం ఇదీ. కాని దీనిని సామాన్య జనులు అంగీకరిస్తారా? వారికి తమ కండ్ల ఎదుట దైవమొక ఉజ్జ్వలమూర్తిగా, వృషభవాహనుడై కనుపించాలి. అట్టి దృశ్యమే ఒకపరి కనుపిస్తే, అది అంతరించక తప్పదు. అందుచేత అది క్షణభంగురం.

నిత్యమూ, నిరతానుభూతమూ, నిత్యస్థితమూ అయినదాన్ని తేవారము స్తుతిస్తుంది. తేవారం సూటిగా సత్యం దరికి చేరుస్తుంది.

## భాషణములు 513

మేజర్ చాడ్విక్ మళ్ళీ తాను పద్యరూపంలో వ్రాసిన మంత్రానువాదాన్ని చదవమని శ్రీభగవాన్ కు అందించాడు. శ్రీ భగవాన్ మృదువుగా శ్రీ భాష్యకారుల వ్యాఖ్యానాన్ని ప్రసంగించి వివరించారు. బ్రహ్మలోకాలను ప్రదేశంగా భావించడం తప్పుగాదు. ఇది చాలమంది పౌరాణికులూ, ఇతర సంప్రదాయాల వారు క్రమముక్తిని వివరించడం ద్వారా బ్రహ్మలోకాన్ని సూచిస్తున్నారు. కాని ఉపనిషత్తులు సద్యోముక్తిని ప్రతిపాదిస్తాయి. 'నతస్యప్రాణా ఉత్క్రామంతి; ఇహైవ ప్రలీయంతే'. "ప్రాణములు ఎగిసిపోవు; ఇక్కడే విలీనమవుతాయి" కాబట్టి బ్రహ్మలోకమంటే, బ్రహ్మసాక్షాత్కారమే. అది యొక స్థితి, ప్రదేశం కాదు. ప్రదేశమైతే, 'పరామృతాత్'ను సరిగా అర్థం చేసుకోవాలి. "అవ్యాకృతము" జగదతీతమైన కారణశక్తి కనుక అది "పరము", ఆత్మసిద్ధి అయినవరకు నిలిచి ఉంటుంది గనుక అది "అమృతము", అందుచేత పరామృతాత్ అంటే అవ్యాకృత'మని అర్థం. క్రమముక్తివాదుల మతంలో ఉపాసకుడు తన ఇష్టదేవత లోకానికి వెళతాడు. వాని కదే బ్రహ్మలోకము. ఇతర లోకాలకు వెళ్ళే జీవులు మరలివచ్చి పునర్జన్మ లెత్తుతారు. కాని బ్రహ్మలోకానికి పోయిన వాళ్ళు అలా కాదు. అదీగాక, ఏదో రం ఒక ప్రత్యేక లోకానికి పోనెంచే వారికి ఆ లోకాలకు చేరేందుకు తగ్గ విధానాలున్నాయి. వ్యక్తిలో కోర్కె లేశమేని ఉన్నంతవరకూ బ్రహ్మలోకం ప్రాప్తించదు. వానికి బ్రహ్మలోకం కూర్చగలిగేది తృష్ణ (కోరిక) పూర్తిగా లేక పోవడం వలన మాత్రమే. వితృష్ణవల్ల (కోరికలు లేకపోవడం) పునర్జననానికి నిమిత్తమంతరిస్తుంది. బ్రహ్మ ఆయుఃప్రమాణం ఎన్నడ మసాధ్యమే అనవచ్చును. కాని ఆయా ఆ. లోకాధిదేవతకు వయఃపరిమితి నిశ్చితంగా ఉంటుంది. అతడు గతిస్తే, ఆ లోకమూ లయమౌతుంది. దానితోనే ఆ లోకవాసులందరూ ముక్తులౌతారు, ఆత్మసిద్ధికి పూర్వం, వారివారి వ్యక్తిగత జ్ఞాన స్వభావాలలో తేడాలెట్టివైనా సరే.

క్రమముక్తివాదులు సద్యోముక్తిభావన ఒప్పుకోరు. ఎందుకంటే, అవిద్యానష్ట సమయంలోనే జ్ఞానికి దేహభావన నశిస్తుంది. కాని అతడు దేహంలో జీవిస్తూనే ఉంటాడు. వారడిగేదిది - 'మనస్సులేక దేహం ఎలా పనిచేస్తుంది?" దీనికి సమాధానం కొంత విపులంగానే వివరించవలసి ఉంది.

జ్ఞానము, అజ్ఞానముతో అసంగతము కాదు. (జ్ఞానము, అజ్ఞానముతో పొసగక పోవడం లేదు) ఎందుకంటే ఆత్మ దాని శుద్ధస్థితిలో అజ్ఞాన బీజంతో కలిసి నిద్రలో ఉంటుంది. జాగ్రత్ స్వప్న అవస్థలలోనే అసంబద్ధత కనబడుతుంది. అజ్ఞానానికి ఆవరణ (కప్పివేయడం), విక్షేపము (నానాత్వము) అని రెండు ఆకృతులున్నాయి. వీటిలో 'ఆవరణ' సత్యాన్ని కప్పిపుచ్చే తెరను సూచిస్తుంది. ఇది నిద్రలో ప్రబలంగా ఉంటుంది. విక్షేపము (నానాత్వము) వేర్వేరు కాలాల్లోని కార్యకలాపము. ఇది నానాత్వమును కల్గించి జాగ్రత్ స్వప్నాలలో ప్రబలంగా ఉంటుంది. ఆవరణమనే ఆ తెర తొలగితే సత్యం గోచరిస్తుంది. అది జ్ఞానికి తొలగిపోతుంది కాబట్టి ఆయనకు కారణ శరీరం నశిస్తుంది. విక్షేపం మాత్రం ఆయనకు కొనసాగుతుంది. అలా అయితే కూడా అది అజ్ఞానికి, జ్ఞానికి ఒకే విధంగా ఉండదు. అజ్ఞానికి అన్ని విధములయిన వాసనలు. అంటే కర్తృత్వ, భోక్తృత్వములు ఉంటాయి. కాని జ్ఞానికి కర్తృత్వ భావన నశించింది. ఆ విధంగా ఒక విధమైన వాసన మాత్రమే జ్ఞానికి మిగిలి ఉంటుంది. అది కూడా చాలా బలహీనంగా ఉండి ఆ మనస్సు వశపరచుకోదు. ఎందుకంటే ఆయన ఎప్పుడూ ఆత్మ యొక్క సచ్చిదానంద స్వభావపు ఎరుకతో ఉంటాడు. క్షీణమైన భోక్తృత్వ వాసన మాత్రమే జ్ఞానిలో మిగిలి ఉన్న మనశ్శేషము. అందువల్ల ఆయన శరీరంలో నివసిస్తున్నట్లు కనిపిస్తాడు.

పై వివరణ 'నకర్మణా' మంత్రానికి అన్వయిస్తే ఇలా ఉంటుంది. జ్ఞానికి కారణ శరీరం నశించింది. స్థూలశరీరం ప్రభావం అతనిపై ఉండదు; సర్వార్థాలా, అది నష్టమైనట్లే. మిగిలిన దొక్క సూక్ష్మశరీరమే. దానికి 'అతివాహిక శరీర'మని మరొకపేరు. భౌతిక కాయం వదలిన తర్వాత అందరూ ఈ అతివాహిక శరీరాలనే ధరిస్తారు. అనుకూలమైన వేరే భౌతికకాయం గైకొన్నదాకా, ఈ అతివాహికంతోనే వారితర లోకాల్లో తిరుగాడుతారు. ఈ సూక్ష్మశరీరంతోనే జ్ఞాని బ్రహ్మలోకంలో సంచరిస్తాడని చెపుతారు. పూర్ణవిమోచన మప్పుడు ఆ సూక్ష్మ శరీరమూ లయించిపోతుంది.

ఈ వివరణమంతా బయటనుండి చూసేవారిని ఉద్దేశించి చెప్పబడింది. జ్ఞాని స్వయంగా ఇట్టి ప్రశ్నలు అడగడు. తనది ఎట్టి పరిధులూ లేని నిర్నిబంధన స్థితియని జ్ఞానికి స్వానుభవమే.

భక్తుడు: పైన చెప్పిన వివరణను బట్టి "పూర్ణమోక్షము" ఎట్టిది?

మహర్షి అతివాహిక, లేక సూక్ష్మశరీర మన్నది, నిద్ర మేల్కొన్న వెంటనే అహంకారం లేచేముందు, ఆ అంతరంలో అనుభవమయ్యే శుద్ధ తేజస్సుకు సమానము. అది విశ్వచైతన్యము. అదిగూడ హృదయంనుంచి ప్రతిఫలించే కాంతి. ఎప్పుడు ఆ ప్రతిబింబముపోయి, హృదయంలో నిజమైన మూలకాంతిగా నిలబడుతుందో అదే పూర్ణ మోక్షము.

భ: యోగవాసిష్ఠంలో జీవన్ముక్తుని చిత్తం అచలమని ఉన్నది.

మ: నిజమే. అచలచిత్తమే శుద్ధమనస్సు. జ్ఞాని మనస్సు శుద్ధమనస్సు. బ్రహ్మము జ్ఞాని మనస్సు కన్యముగాదని జ్ఞానవాశిష్ఠమే చెప్పుతున్నది. కాబట్టి బ్రహ్మము శుద్ధమనస్సే.

భ: బ్రహ్మము శుద్ధమనస్సు కావడం, బ్రహ్మము సచ్చిదానందమగుటతో సమన్వయిస్తుందా? ఎందుకంటే శుద్ధమనస్సు కూడా పూర్ణమోక్షంలో నశిస్తుంది కదా.

మః శుద్ధమనస్సు నంగీకరిస్తే, జ్ఞానియొక్క ఆనందానుభూతిగూడ ప్రతిబింబితంగానే గణించాలి. ఈ ప్రతిబింబం చివరకు మూలతేజంలో లీనంకావాలి. అందుచేతనే జీవన్ముక్తి స్థితిని ఒక నిర్మలమైన అద్దంలో మరియొక నిర్మలమైన అద్దం యొక్క ప్రతిబింబం వంటిదని చెప్పేరు. అట్టి ప్రతిబింబంలో కనిపించేది శుద్ధాకాశంగాక మరేమౌతుంది. అట్లే జ్ఞానియొక్క ప్రతిబింబిత ఆనందం వాస్తవమైన ఆనందాన్నే నిరూపిస్తోంది.

ఇంతకూ ఇవన్నీ మాటలే. వ్యక్తి అంతర్ముఖుడైతే చాలు. అంతర్ముఖి మనస్సునకు శాస్త్రాలక్కరలేదు. అవి కావలసినవి మిగిలిన వాళ్ళకే.

## భాషణములు 514

ఆశ్రమవాసిగా ఉన్న మాకైవర్ (MacIver) అను భక్తుడు స్విట్జర్లాండులోని ఒక గురువు తనను ఆహ్వానిస్తున్నాడని, తాను అచటికి పోవచ్చునా అని శ్రీ భగవానును అడిగాడు. శ్రీ భగవాన్ ఇలా చెప్పారు:

మహర్షి: ఒకానొక శక్తి అతనిని ఇక్కడడికి తీసుకువచ్చింది. అదే శక్తి అతనిని యూరోప్కు తీసుకువెళ్తుంది. ఈ ప్రపంచము కేవలము మనోకల్పితమని, ఆ మనస్సు ఆత్మలోనే ఉందని అతనిని ఎప్పుడూ గుర్తుపెట్టుకోమను. శరీరం ఎక్కడికిపోయినా, మనస్సు ఆధీనంలో వుండాలి. శరీరం కదుల్తుంది కాని ఆత్మ కాదు. ప్రపంచం ఆత్మలోనే ఉంది. అంతే.

## భాషణములు 515

చాడ్విక్ (భక్తుడు): నిన్నజేసిన వివరణలో ఆవరణ విచ్ఛేదం వల్ల కారణ శరీరనాశం కలుగుతుందన్నారు. అంతవరకూ స్పష్టమే. కాని స్థూలశరీర పతనంగూడ భావించుటెట్లు?

మహర్షి: వాసనలు బంధహేతువులని, భోగహేతువులని రెండురకాలు. అహంకారాన్ని అధిగమించాడు గనుక, జ్ఞానికి బంధం కలిగించేదేదీ ఉండదు. బంధహేతువు నశించిపోయినందువల్ల, ప్రారబ్ధం భోగవాసనగ మాత్రమే నిలుస్తుంది. అందుచేతనే సూక్ష్మశరీర మొక్కటే జ్ఞానానంతరము మిగులుతుందంటారు.

'కైవల్యం' ప్రకారం జ్ఞానం కల్గిన వెంటనే సంచితకర్మ నశిస్తుంది. బంధభావన లేనందున అగామి అక్కడ పనిచెయ్యదు. ప్రారబ్ధం భోగంతో (అనుభవించడంతో) పూర్తి అవుతుంది. ఇట్లు ప్రారబ్ధం కాలక్రమంలో నశించి, క్రమంగా దానిలోనే స్థూల శరీరమూ నష్టమౌతుంది.

శరీరత్రయమూ, కర్మత్రయమూ, తార్కికుల కాష్ఠోదకారులే గాని వీనిలో ఏవీ జ్ఞానిని బాధించవు. సాధకుడు తానెవరో కనుగొనవలెనని బోధ. పై చెప్పిన వివాదాల్లో వానికి మక్కువ ఉండదు. ఆత్మను దర్శించి శాంతితో ఉండు.

## భాషణములు 516

ప్రపంచం సత్యము, అసత్యము (మిథ్య) రెండూ అని అద్వైతులే వాదిస్తారు. కాబట్టి ప్రపంచం సత్యమా లేక మిథ్యా అని ఒక ప్రశ్న. ప్రపంచము ఆత్మకంటే వేరుగా ఉందని భావిస్తే మిథ్య అని, ఆత్మగా భావిస్తే సత్యమని శ్రీభగవాన్ చెప్పారు.

## భాషణములు 517

మ్లేచ్ఛదేశాల్లోని తాంత్రిక విద్య (spiritism) వర్ణించేవి రెండు శ్లోకాలు యోగవాసిష్ఠంలో ఉన్నాయి. సాధారణంగా జనం అనుకునే దానికన్న ఎక్కువగానే పాశ్చాత్య దేశాల్లో అభిచారం (Black Magic) అభ్యసించడం కలదన్నాడు మాకైవర్. అప్పుడీ లేఖకునికి పాల్ బ్రంటన్ తనతో పూర్వం అనియున్న మాట గుర్తుకువచ్చింది. అభిచార ప్రయోగంతో సంబంధం ఉన్న ఒక స్త్రీని చూసి నిజంగా తాను భయపడినాడట.

శ్రీభగవాన్ వారిని 'దేవీకాలోత్తరం' చదివారా అని అడిగారు. దానిలో అభిచారప్రయోగాల ఖండనం ఉంది. దానివల్ల చివరకు స్వవినాశమే జరుగుతుంది. అవిద్యయే (అజ్ఞానమే) చెడ్డది. అదే వ్యక్తిని ఆత్మహత్యలాంటివి చేసుకొనేటట్లు చేస్తుంది. దానికి ఈ అభిచార ప్రయోగాలవంటివి చేర్చడమెందుకు?

భక్తుడు: ఆ ప్రయోగాల బారిపడిన వానికేదైనా ప్రతిక్రియ ఉన్నదా?

మహర్షి: భక్తియే.

భ: అపనింద వంటి దౌష్ట్యాల కన్నింటికి సహనమొక్కటే (Non-resistance) మందుగా కానవస్తున్నది.

మ: అట్లే. నిందచే నిందను, ఘతముచే ఘాతమును జయించలేము. ఈ విధంగా దాని నివారణోపాయాన్ని సాధించలేము. శాంతంగా ఉండు. ఈ శాంతి నొప్పి కల్గిన వ్యక్తికి శాంతినిస్తుంది. నొప్పించి నాతనికి అశాంతిని గల్పించి, తనతప్పు నొప్పుకొని తా నొప్పించి నతని క్షమ నర్థించే వరకూ వదలదు.

ఈ దేశంలో చిరకాలంగా ఉత్తమోత్తమ మహాత్ములపై కూడా అభిచార ప్రయోగం చేయబడిందని చెప్పబడింది. దారుకావన ఋషులు సాక్షాత్ శివునిపైనే ఇట్టి ప్రయోగం చేసారు.

ఆ తరువాత సంభాషణ 'బ్రహ్మలోక' విషయంగా మళ్ళింది. శ్రీ భగవాన్ ఆత్మలోకమే బ్రహ్మలోకమన్నారు. 'బ్రహ్మైవలోకః' = బ్రహ్మలోకః, (బ్రహ్మయే లోకము) బ్రహ్మలోకం ఆత్మయే. బ్రహ్మలోకం అంటే ఆత్మ.

లోక, ఆలోక రెండూ సమములే. ఉళ్ళదు నార్పదులోని 'అందమిల్లాక్కణ్' అదే. 'లోక్యతే ఇతిలోకః' - చూడబడునది; ఆలోకింపబడునది లోకము.

## భాషణములు 518

వి.గుప్త ఒక తెలుగు పండితుడు, ఆశ్రమానికి వచ్చాడు. మాటల్లో శ్రీభగవాన్ అన్నారు - 'అహంకృతి వేరు, అహము వేరు. అహము కేవల సత్; ఆ రెండవది అహంకారము. సత్తును తెలియుటకు ముందు అహంకృతిని దాటాలి. పరమాత్మ, అవ్యక్తుడు, వ్యక్తము కాబోతున్నాడన్న ప్రథమ సూచన 'అహం స్ఫురణ'. బృహదారణ్యక ఉపనిషత్తులో ఉంది - 'అహం'నామ అభవత్' - అహంపేరుగల

వాడైనాడు. సత్ మొదటి పేరు అహం. భక్తుడు: అనుగ్రహం ఎలా పనిచేస్తుంది. గురుని మనస్సు శిష్యుని మనస్సును ప్రభావితం చేస్తుందా, మరోవిధంగానా?

మహర్షి: అనుగ్రహములలోకెల్ల మౌనానుగ్రహం ఉత్తమం. అదే అత్యుత్తమమైన

ఉపదేశం గూడ. భ: మౌనము, అతి గట్టిగా చేసే ప్రార్ధన అని స్వామి వివేకానందులు కూడా

అన్నారు.

మ: అవును అది సాధకుని విషయంలో గురుని మౌనము అతి గట్టిగా చేసే ఉపదేశము. అతి ఉత్తమమైన అనుగ్రహం, మౌనమే. స్పర్శాది చక్షురాది ఇతర దీక్షలన్నీ మౌనం నుండి వచ్చినవే. కాబట్టి అవి అప్రధానాలు. మౌనమే ప్రధాన రూపం. గురువు మౌనంగా ఉంటే శిష్యుని మనస్సు తనంతట తానే నిర్మలమౌతుంది.

భ: మానవుడు ప్రాపంచిక బాధలు వచ్చినప్పుడు గురునిగాని, దైవాన్నిగాని ప్రార్ధించడం యుక్తమా?

మ: నిస్సందేహంగా.

## భాషణములు 519

మహర్షి: మహావాక్యాలు వాని వివరణలు అంతులేని చర్చలకు దారి తీస్తాయి. అవి సాధకుల మనస్సులను బాహ్యంగా ప్రవర్తించేటట్లు చేస్తాయి. మనస్సు అంతర్ముఖంం చేయటానికి సూటిగా "నేను"లో నిలిచిపోవాలి. అప్పుడు వెలివృత్తులు అంతమౌతాయి. శాంతి నెలకొంటుంది.

కొంతసేపయ్యాక ఎవరో యోగవాసిష్టం నుంచి రెండు శ్లోకాలు చదివారు. అందులో స్పర్శదీక్ష, చక్షుదీక్షలు ప్రస్తావింపబడ్డాయి.

శ్రీభగవానన్నారు - శిష్యులు తన్ను సమీపించి నప్పుడు దక్షిణామూర్తి మౌనం వహించారు. దీక్ష నిచ్చుటలో అది ఉత్తమ పద్ధతి. దానిలోనివే ఇతర అన్ని పద్ధతులూను. ఇతర పద్ధతుల్లో కర్త విషయ ప్రమేయం ఉంది. మొదట కర్తవలె, తరువాత విషయం. ఈ రెండూ లేకుంటే ఒకరు ఆ రెండవవానిని చూడటం, తాకటం ఎలాగ? సర్వశ్రేష్ఠమైనది మౌనదీక్షయే. దానిలోనే దృక్కు స్పర్శ ఉపదేశం - అన్నీ కలిసి ఉన్నాయి. వ్యక్తిని అది అన్ని విధాల పవిత్రుణ్ణి చేసి సత్యస్థితిలో నిల్పుతుంది.

## భాషణములు 520

ఆస్ట్రేలియావాసి శ్రీలోమన్ హిందూతత్త్వ శాస్త్రం చదివినట్లు ఉన్నాడు. తాను ఏకమునే నమ్ముతాడు కాని జీవుడింకా మాయలోనే మునిగియున్నాడని మరేమేమో ప్రసంగించాడు.

మహర్షి: నీవు నమ్మే ఆ ఏకం ఏమిటి? దానిలో జీవునికి స్థానమేది?

భక్తుడు: ఏకం బ్రహ్మమే.

మ: ఏకతలో జీవునికి స్థానంలేదే.

కాని జీవుడింకా బ్రహ్మను అనుభవగతం చేసుకోలేదు. తానింకా వేరనే అనుకుంటున్నాడు.

మ: జీవుడు వేరుగనే ఉంటాడు. ఎందుకంటే వేరే ఏదైనా ఊహించడానికి అలా ఉండాలి.

భ: కాని జీవుడు నిజం కాదు.

మ: నిజం కానిదేదీ ఫలాలనీయదు. అది ఎలా ఉందంటే నువ్వు కుందేటి

కొమ్ముతో ఏదో జంతువును చంపేశానన్నట్లే. కుందేటికి కొమ్ములు రావు. భ: నేను చెప్పినదాంట్లో తప్పుని గుర్తిస్తున్నాను. కాని నేను దేహస్థితి నుండి

మాట్లాడుతున్నాను. మ: నేనంటున్నావే, ఆ “నేను” ఎవరు? అదేమో కనుగొంటే ఆపైన ఆ భ్రాంతి ఎవరిదో చెప్పగలవు.

కొంతసేపాగి భగవాన్ ప్రశ్నించారు. శారీరిక స్థితిలో (స్థూలస్థితిలో) ఇప్పుడున్నా నంటున్నావు. సుషుప్తిలో (కలలు లేని గాఢనిద్రలో) ఏ స్థితిలో ఉన్నావు?

భ: మరల భౌతిక స్థితి (స్థూలస్థితి) లోనే ఉన్నానని అనుకుంటున్నాను.

మ: “నేను అనుకుంటున్నాను" అని నీవు అన్నావు. అంటే మెలకువగా నున్నప్పుడు అలా అంటున్నావనే కదా? అదేమైతేనేం? గాఢ నిద్రలో నీవున్నావని ఒప్పుకుంటున్నావు" అవునా, కాదా?

భః అవును. కాని నే నప్పుడు ప్రవృత్తుణ్ణి కాను. (ఏమీ పని చేయలేను)

మ: ప్రవృత్తుడవు కాకపోవచ్చు, కాని నిద్రలో నీవున్నావు. ఆ నీవు ఇప్పుడు కూడా ఉన్నావు. అవునా, కాదా?

భ: అవును.

మ: కాని భేదమిది - నీవు నిద్రలో ప్రవృత్తుడవు కావు. మెలకువలో నీకు ఆలోచించే శక్తి ఉంది. నిద్రలో దానికి దూరమైనావు, కాదా?

భ: అవును.

మ: అలా అయితే నీ నిజస్వరూపం ఏమిటి? ఆలోచనలతో కూడి ఉండడమా లేదా ఆలోచనతో సంబంధం లేకుండా ఉండడమా?

భః ఇప్పుడర్థమౌతున్నది. కాని నిద్రలో నేనుంటినని నేనెరుగను.

మ: అని, మేల్కొని ఇప్పుడంటున్నావు, నిద్రలో అట్లనవు. అటుగాక నిద్రలో నీకు స్థితే లేదంటావా? నీకు ఉనికి లేదంటావా?

భ: అలా అనను.

మః తాత్పర్యమిది - నిద్రలోనూ, మెలకువలోనూ నీవున్నావు. కాబట్టి కేవలస్థితి, నీ ఆత్మ. ఉన్నావని నీ కెరుక ఉంది. ఉనికి ఆ విధంగా ఎరుకగూడా, (సత్, చిత్). నీ సహజస్వభావమే అది.

భు ఆత్మజ్ఞానానికి కూడ ఆలోచన అవసరమే.

మ: ఆ ఆలోచన ఇతర ఆలోచన లన్నిటినీ తొలగించడానికే,

భ: నా అజ్ఞానం వల్ల నేనాపూర్ణ సచ్చిదానుభూతినందలేకపోతున్నాను. మః ఎవరా 'నేను'? ఎవరికా అజ్ఞానం? వీనికిచ్చే సమాధానాలే చాలు నీవిప్పటికే అనుభవజ్ఞుడనటానికి, తన ఉనికిని సంశయించే వాడెవ్వరైనా ఉన్నారా? లేదా ఎవ్వరైనా "నేను" నిద్రలో లేనని చెప్పగలరా? ఆ విధంగా కేవలస్థితిని అందరూ అంగీకరిస్తారు. ఆ ఒప్పుకోవడం అంటేనే చైతన్యం. అందుచేత అందరూ జ్ఞానులే. అజ్ఞానియే లేదు.

భ నిజమే. తెలుస్తున్నది. కాని నాదొక చిన్నప్రశ్న ఉంది. ఆత్మస్థితి కోరికలు లేని స్థితి. కోరికలే లేనివాడు మానవుడే కాడు.

మ: నిద్రలో నీ వున్నట్లు ఒప్పుకున్నావు. అప్పుడు నీకే ప్రవృత్తులూ లేవు; స్థూలశరీర జ్ఞానమూ లేదు. నీకెట్టి దేహపరిధీ లేదు. కాబట్టే నీకు వేరుగా ఏదీ కనుపించలేదు.

ఇప్పుడు జాగ్రదావస్థలో ఆ నీవే దేహపరిమితిని కలువుకొని ఆ ఉనికిగానే కొనసాగుతున్నావు. ఈ పరిమితివల్ల నీ కితరవిషయాలు కనిపిస్తాయి. అందుచేత కోరిక తలయెత్తుతుంది. నిద్రలోని వాంఛారాహిత్యస్థితి. నీ ఇప్పటి సుఖాన్ని లవలేశం తగ్గించలేదు. అప్పుడు నీకే కోరికా లేదు. కోరికలు లేకపోయాయని నీకెట్టి దిగులూ కలుగలేదు. కాని ఇప్పుడే దేహానికి కట్టుపడి. కోరికలకు అవకాశమిస్తున్నావు. నీవు ఈ పరిమితులను ఉంచుకొని, కోరికలను పెట్టుకొని ఉండాలని ఎందుకు కోరుకుంటున్నావు?

తానున్నాని దేహం నీకు చెప్తోందా? అది ఖచ్చితంగా ఎరుకతో ఉండి నీ దేహానికి భిన్నమైనదే. అది ఏది?

అది "నేను", దానిని అహంకారం అని చెప్తావా? నీవు నిద్రనుంచి మేల్కొన్న తరుణంలోనే ఆ అహంకారం పుడుతుంది. అదట్లుంచు, దేహం చేతనం కాదు, బ్రహ్మము పలుకదు. పలికేది అహంకారమే. నిద్రలోనుండగా ఎవ్వడూ ముక్తి నభిలషించదు. ఆ కోరిక కలిగేది జాగ్రదవస్థలోనే. జాగ్రత్తులోని వృత్తులు అహంకారం చేసేవి. అహంకారం, అహంస్ఫురణ సదృశమే. ఆ “నేను” ఎవరో కనుక్కో అలా చేసి "నేను"లో నిలిస్తే ఆ అన్ని సందేహాలూ పోతాయి.

## భాషణములు 521

కొందరు కాంగ్రెసు వాదులు ప్రశ్నల పట్టి నొకదాన్ని శ్రీభగవాన్ కందించారు

1. భారతదేశం ఇంకా ఎంతకాలం దాస్యం అనుభవించాలి?

2. భారతమాత పుత్రుల విమోచనకై చేసిన త్యాగాలింకనూ చాలవా?

3. మహాత్మగాంధీ బ్రతికి యుండగానే ఇండియాకు స్వాతంత్ర్యమువచ్చునా?

ఆ వరుసలోగాక, భగవానులిట్లు సమాధానాలిచ్చారు

గాంధీజీ తన్ను దైవానికర్పించుకొన్నారు నిష్కామంగా తన పని చేస్తున్నారు. ఫలితములగూర్చి అతడు పట్టించుకోరు. వచ్చిన ఫలితాలను అంగీకరిస్తారు. దేశసేవకుల దృక్పథం ఆ విధంగానే ఉండాలి.

భక్తుడు: ఈ ప్రయత్నాలు సఫలములౌతాయా?

మహర్షి: పృచ్ఛకు డాత్మార్పణం చేసుకోనందువల్లనే, ఈ ప్రశ్న.

భ: అయితే దేశక్షేమానికై కోరి పనిచేయవద్దా?

మ: మొదట నిన్ను గురించి నీవు శ్రద్ధ వహించు. మిగలినది సహజంగా దాని వెంటే వస్తుంది.

భ: నేను నా వ్యక్తిపరంగా అడగటం లేదు. దేశవిషయంగా నా ప్రశ్న.

మ: మొదట శరణాగతి చేసి చూడు. స్వార్పణం చేయనందువల్లనే ఈ సందేహాలు. శరణాగతితో సత్త్వాన్ని పెంచుకో. నీ బలం వృద్ధి అయ్యే మేరకు నీ పరిసరాలు బాగుపడుతున్నట్లు గుర్తిస్తావు.

భ: మా యత్నాలు సముచితాలా కావా అన్న యోచనే అక్కరలేదా?

మ: దేశానికై పాటుపడుతున్న గాంధీ జాడనే నడు. 'స్వార్పణం' (ఆత్మార్పణం) అదే మంత్రం.

మరొక కాగితం శ్రీభగవాన్ కందించారు -

"మేము నల్గురము కూర్గునుండి ఢిల్లీ వెళ్ళివచ్చాము. ఒక ప్రతినిధి వర్గంగా భారత జాతీయ కాంగ్రెస్సు కార్యవర్గ సభకు వెళ్ళి మరలి వస్తున్నాము. మమ్మిచటికి కూర్గు కాంగ్రెసు కమిటీవారు పంపారు. కూర్గుజిల్లా కాంగ్రెసుకు, జిల్లా ప్రజలకు ఏదైనా సందేశ మిమ్మని ప్రార్థిస్తున్నాము."

మహర్షి: ఇంతకు పూర్వ మిచ్చిన సలహా దీనికి వర్తిస్తుంది. సందేశమంతా 'స్వార్పణం' (ఆత్మార్పణం) అన్నదానిలోనే ఉంది.

## భాషణములు 522

ఒక దర్శనార్థి ఇలా అడిగాడు:

భక్తుడు: నాకు జ్ఞానం కావాలి.

మహర్షి: ఎవరు జ్ఞానం కోరుతున్నారు?

భ: నేను కోరుతున్నాను.

మ: ఆ 'నేనెవరు'? ఆ "నేను" కనుక్కొని ఆ తర్వాత, కావలసిన జ్ఞానమేదో చూద్దువుగాని.

## భాషణములు 523

యాత్రాస్పెషల్లో ఒక బెంగాలీ బృందం ఆశ్రమానికి వచ్చింది. అందులో నొకరుతాను పాల్ బ్రంటన్ గ్రంథం చదివిన నాటినుంచి, శ్రీభగవాన న్ను చూడ నుత్కంఠతతో నున్నానంటూ అడిగాడు -

భక్తుడు: నా మనోవికారాలను (passions)ను దాటడం ఎలా?

మహర్షి: వాని మూలాన్ని కనుక్కో అప్పుడు సులువౌతుంది. మనోవికారాలు ఏమిటి? కామక్రోధాదులు అవి ఎందుకు వస్తాయి? చూచే విషయాలపైన ఇష్టాయిష్టాలవల్ల (రాగద్వేషాలవల్ల). విషయాలు నీ దృష్టిపథంలో కెట్లు వచ్చాయి? అజ్ఞాన మూలంగా, ఏమా అజ్ఞానం? ఆత్మయొక్క అజ్ఞానం. కాబట్టి నీవు ఆత్మను కనుగొని, అందులో నిష్ఠతో ఉంటే, మనోవికారాలవలన ఇబ్బంది ఉండదు.

(మరికొంతసేపాగి) మనోవికారాలకు కారణమేంటి? ఆనందంగా ఉండాలనే కోరిక లేదా భోగలాలస (విలాసములలో ఆసక్తి) ఆనందంగా ఉండాలనే కోరిక ఎందుకు కల్గుతుంది? ఎందుకంటే నీ స్వభావము (స్వరూపము) ఆనందం కనుక. నీ స్వభావంలో నీవు ఉండడం సహజం కనుక. ఈ ఆనందం ఆత్మలోకాక వేరే ఎక్కడా దొరకదు. దానికోసం వేరే ఎక్కడా వెదకవద్దు. (చూడవద్దు) ఆత్మనే వెదకి అందులోనే స్థిరంగా ఉండు. నీ సహజమైన ఆనందం కేవలం తిరిగి కనుగొనబడినదే, అందుచే మరల అది పోవడం అనేది జరగదు. అలాగాక, వేరే విషయాల వలన కల్గే ఆనందం, బాహ్యం. కనుక అది తప్పక నష్టమౌతుంది. అందుచే అది శాశ్వతం కాబోదు. కావున దానికోసం ప్రయత్నం చేయడం వ్యర్థం. భోగములకై (విలాసములకై) తృష్ణను ప్రోత్సహించరాదు. వెలుగుతున్న అగ్నిని పెట్రోలు పోసి ఆర్పజాలము. ఇప్పుడు తృష్ణను తృప్తిపరచడం ద్వారా, తర్వాత మనోవికారాలను అణచ వచ్చునను కోవడం తెలివితక్కువతనం. మనోవికారాలను నిరోధించడానికి నిస్సందేహంగా వేరే ఉపాయాలు కూడా ఉన్నాయి. అవి, (1) నియమ బద్ధమైన ఆహారం 2. ఉపవాసం. 3. యోగాభ్యాసం 4. ఔషధసేవనం. కాని వాటి ఫలితాలు తాత్కాలికం.

అడ్డుతొలగించగానే ఈ మనోవికారాలు తిరిగి మరింత వేగంతో పైకి వస్తాయి. వాటిని జయించేమార్గం ఒక్కటే. వాటిని నిర్మూలించటమే. అది ఎలా అంటే, పైన చెప్పినట్లు వాటి మూలాన్ని కనిపెట్టడమే.

## భాషణములు 524

మరొక యాత్రికుడు: నేను కుటుంబం ఉన్నవాడిని కుటుంబంలోనే ఉండేవారికి ముక్తిసాధ్యమా? అది ఎలా?

మహర్షి: కుటుంబం అంటే ఏమి? ఎవరిదాకుటుంబము? వీనికి సమాధానాలు కనుగొంటే మిగత ప్రశ్నలు వాటికవే పరిష్కారమౌతాయి. నాకిది చెప్పు. కుటుంబంలో నీవున్నావా, నీలో కుటుంబం వుందా?

అతడు ఐదులీయలేదు. శ్రీభగవాన్ చెప్పసాగారు

నీవెవరు? నీలో మూడు దశలు, అంటే; జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు ఇమిడి ఉన్నాయి. నిద్రలో నీకు కుటుంబం దాని బంధాలు లేవు. ఈ ప్రశ్నలు ఆ అవస్థలోనివి కావు. కాని ఇప్పుడు, మెలకువలో, నీకు కుటుంబము దాని బంధాలు తెలిసేయి. అందువల్ల నీవు మోక్షాన్ని కోరుకుంటున్నావు. కాని నిద్రలోనూ, మెలకువలోనూ ఉన్నది ఆ నీవే.

భ: ఇప్పుడు కుటుంబంలో నేనున్నానుకొంటున్నాను. గనుక, నాకు మోక్షకాంక్ష సరియైనదే.

మ: నిజమే. కాని నాకిది యోచించి చెప్పు - నీవు కుటుంబంలో ఉన్నావా? కుటుంబం నీలో వుందా?

మరొకరు - కుటుంబం అంటే ఏమిటి?

మ: అవును, అది తెలియవలసిందే.

భ: భార్య, సంతానము, వారు నా మీద ఆధారపడిన వారు. కుటుంబమంటే అదే

మ: కుటుంబంలోనివారు నీ మనస్సును కట్టి ఉంచారా? కాక నీవే వారికి కట్టివేసుకొన్నావా? వారువచ్చి నీతో 'మేము నీ కుటుంబం, మాతో ఉండు", అన్నారా? లేదా నీవే వారిని నీ కుటుంబంగా పరిగణించి వారికి బద్ధుడవైనావా?

భ నేనే వారిని నా కుటుంబమని, భావించి వారికి బద్ధుడననుకుంటున్నాను.

మ: అదే, ఫలానా నా భార్య. ఫలానవారు నా సంతానం అనుకొన్నావు గనుకే వారికి బద్ధుడవనుకుంటున్నావు.

ఈ ఆలోచనలు నీవి; వాని ఉనికికి నీవే కారణం. ఆ ఆలోచనలను నీవు ఉంచుకోవచ్చు లేదా వదులుకోవచ్చు. ఉంచుకోవడం బంధం, వదులు కోవడం మోక్షం.

భ: ఇంకా నాకది స్పష్టం కాలేదు.

మ: ఆలోచించడానికి నీ వుండాలి. ఈ ఆలోచనలో, వేరే ఆలోచనలో ఆలోచించేది ఆలోచనలు మారుతాయి. నీవు మారవు. వెళ్ళిపోతున్న ఈ ఆలోచనలను పోనీ. మారని ఆత్మను పట్టుకో. ఆలోచనలే నీకు బంధం. వానిని వదలితే మోక్షం. బంధం బాహ్యం కాదు. కాబట్టి మోక్షకోసం బాహ్యమైన ఉపాయం వెదకనక్కర లేదు. ఈ విధంగా ఆలోచించి బద్ధుడగుటగాని, ఆలోచించకుండా ముక్తుడగుటగానీ నీ సామర్థ్యము లోపలే ఉంది.

భ: కాని ఆలోచించకుండా ఉండడం సులభం కాదు.

మ: నీవు ఆలోచించడం మానివెయ్యనక్కరలేదు. వాని మూలమేదో ఆలోచించు, చాలు; వెదకి దానిని కనుక్కో ఆత్మ తానై భాసిస్తుంది. దానిని కనుగొంటే ఆలోచనలు తమంత తామే అంతమౌతాయి. అదే బంధము నుండి ముక్తి.

భ: ఇప్పుడర్థమయింది, తెలుసుకొన్నాను. గురువవసరమా?

మ: నిన్ను నీవు వ్యక్తి వనుకొన్నవరకూ గురువవసరమే. నీకెట్టి పరిధులూ లేవని, సహజంగానే నీవు పరిమితులనుండి ముక్తుడవని తెల్పడానికి గురువు అవసరమే.

## భాషణములు 525

మరొకరు - కర్మలు బంధములు. ఏమైనా ఒక కర్మచేయకుండా ఉండలేము. అలాగే బంధాలు అధికమవుతూనే ఉంటాయి. ఈ పరిస్థితుల్లో వ్యక్తి కర్తవ్యమేమిటి?

మహర్షి: బంధాలు బలపడకుండా, అవి బలహీనమయ్యేట్లు చేయాలి. అదే నిష్కామ కర్మ.

## భాషణములు 526

ఒక దర్శనార్థి ఇలా అడిగారు:

భక్తుడు: దైవానికి కొన్ని పేర్లు పెట్టి నామము పవిత్రమనీ, దాన్ని జపించడం పుణ్యమనీ అంటారు. అదంతా నిజమేనా?

మహర్షి: ఎందుకు కాగూడదు? నీకొక పేరుంది. దానితో పిలిస్తే పలుకుతావు. పుట్టినప్పుడు ఒంటిపైన పేరు వ్రాసుకొని పుట్టావా, ఫలానా పేరు తనదని దేహం చెప్పదు. అయినా నీకొక పేరు పెట్టారు. నీవు ఆ పేరుతో తాదాత్మ్యం చెందేవు కనుక ఆ పేరుకు పలుకుతావు. కాబట్టి పేరుకేదో అర్థం ఉంది. పేరు ఒకానొక దాన్ని సూచిస్తుంది. అది కేవలం కల్పన కాదు. అట్లే దైవనామమూ శక్తివంతము.

దాన్ని జపించడమంటే దాని శక్తిని సంస్మరించటమన్నమాట. అదే పుణ్యం. కాని అడిగి నాతనికిది తృప్తినిచ్చినట్లు లేదు. చివరికాతడు మరలిపోతూ భగవాన్ అనుగ్రహం అర్థించాడు.

శ్రీభగవాన్ వానితో, విశ్వాసంలేనప్పుడు అనుగ్రహం విషయమై తెలిపే శబ్దాలు మాత్రం తృప్తినెలా యిస్తాయన్నారు.

ఇద్దరూ నవ్వుకున్నారు; అతడు వెళ్ళిపోయాడు.

## భాషణములు 527

కూర్గు వనితలు కొందరు హాలులో చేరిరి. వారిలో ఒకరడిగారు.

భక్తురాలు: నాకొక మంత్రోపదేశం అయింది. దాన్ని జపిస్తే అనుకోని ఫలితాలు వస్తాయని కొందరు భయపెడుతున్నారు? ఇంతకూ అది ప్రణవం. మీ సలహా వేడుతున్నాను. దాన్ని జపించేదా? నాకు దానిలో చాలా నమ్మకముంది.

మహర్షి: ఖచ్చితంగా చెయ్యవచ్చు. దాన్ని విశ్వాసంతో జపించాలి.

భ: ప్రణవం మాత్రం చాలునా? లేదా దయచేసి వేరే ఏదైనా సూచనలిస్తారా?

మ: మంత్రజపం ఉద్దేశం ఏమిటంటే ఆ జపం తనలోనే, తన ప్రయత్నం లేకుండానే, జరుగుతోందని తెలిసికోవడానికే. వాచ్యమైన జపం చిత్తజపంగానై, ఆ మానసిక జపం చివరకు నిత్యసిద్ధంగా అనుభవం అవుతుంది. ఆ మంత్రం వ్యక్తి యథార్థ స్వభావమే. ఆత్మసాక్షాత్కార స్థితికూడ అదే.

భ: ఆ విధంగా, సమాధిస్థితానందాన్ని గూడ అందుకోగలమా?

మ: జపం మానసికమై చివరకాత్మగా సాక్షాత్కరిస్తుంది. సమాధియదే.

భః కృపతో నన్ననుగ్రహించండి. నా సాధనను పటిష్ఠం గావించండి!

## భాషణములు 528

ఆంధ్రుడొకడు, నడివయసువాడు - దృష్టి నిలపడానికి (లేదా మనస్సును ఏకాగ్రం చెయ్యడానికి) దైవచింతన అవసరమా?

మహర్షి: ఆ అభ్యాసం ఏమిటి?

భక్తుడు: దృష్టి నిలపడము

మ: దేనికి?

భ: ఏకాగ్రత సాధించడానికి,

మ: ఆ సాధన కంటికి కావలసినంత పరిశ్రమనిస్తుంది. కాని ఆ సమయంలో

మనస్సుకు పని ఎక్కడ ఉంది?

భ: దానికేం చేయాలి?

మ: తప్పనిసరిగా దైవచింతనము చేయాలి.

భ: ఆ అభ్యాసంవల్ల వ్యక్తికి జబ్బువస్తుందా?

మ: కావచ్చు. కాని దానంతట అదే సర్దుకుంటుంది.

భ: నేను రోజూ నాల్గుగంటలు ధ్యానంలో, రెండు గంటలు చూపునిలపడంలో గడుపుతాను. జబ్బు పడ్డాను. నా అభ్యాసంవల్లనే ఆ జబ్బు అన్నారు. అందుచేత

ధ్యానం మానేశాను.

మ: అన్నీ అవే కుదుటబడుతాయి.

భ: కంటి చూపు సహజంగా నిలిస్తే మంచిది కదా?

మ: అంటే?

భ: దృష్టిని సప్రయత్నంగా నిలపాలా? అది నిలిచేవరకు దాని పాటికి దాన్ని వదలివేయటమా?

మ: అది ఒక విషయాన్ని సహజం చేసే ప్రయత్నం కాకపోతే, అది అభ్యాసం ఎలా అవుతుంది? చిరకాలాభ్యాసం తర్వాత అది సహజమౌతుంది.

భః ప్రాణాయామం అవసరమా?

మ: అవును. అది ఉపయోగకరము.

భ: దాన్ని నేను అభ్యసించలేదు. ఆరంభించేదా?

మ: మనోబలము చాలినంత ఉంటే, అన్నీ చక్కబడతాయి.

భ: మనోదార్ఢ్యాన్ని ఎట్లు సాధించేది?

మ: ప్రాణాయామంవల్ల.

భ: ఆహార నియమం కూడా అవసరమా?

మ: అది తప్పక ఉపయోగకరము.

భ: నేను అనంతత్త్వమును ధ్యానం చేసేదా లేక పరిమిత వ్యక్తిని ధ్యానించాలా?

మ: అంటే?

భ: నేను శ్రీరామునిగాని, శ్రీకృష్ణునిగానీ ఒకరి తర్వాత ఒకరిని ధ్యానించవచ్చా?

మ: భావన ఖండమును, అనగా భేదమును సూచిస్తుంది.

## భాషణములు 529

మాట వరసగా శ్రీజ్ఞానసంబంధర్ పాడిన అరుణాచలస్తుతిని ప్రస్తావిస్తూ భగవాన్ ఈ క్రింది కథను క్లుప్తంగా ఇలా చెప్పారు.

1500 ఏండ్ల క్రితం, ఒక శిష్ట సంప్రదాయకుటుంబంలో శ్రీ జ్ఞానసంబంధర్ జన్మించారు. అతనికి మూడేండ్లప్పుడు తండ్రి వానిని శీర్గాళిలోని గుడికి తీసుకొని వెళ్ళారు. అచటి పుణ్యతీర్థం గట్టున వానిని కూర్చోబెట్టి ఆయన స్నానానికై నీటిలో దిగాడు. నీటిలో మునిగియుండిన తండ్రి కనిపించక పిల్లవాడేడువనారంభించాడు. అంతటిలో శివపార్వతు లక్కడికి విమానంలో వచ్చారు. శివుడు పార్వతిని ఆ బిడ్డకు స్తన్యమిమ్మన్నాడు. ఆమె ఒక గిన్నెలో పిండి వానికి త్రావనిచ్చింది. పాలు త్రాగి పిల్లవాడు స్థిమితపడ్డాడు.

స్నానం ముగించి తండ్రి వచ్చి చూస్తే బిడ్డ హాయిగా నవ్వుతున్నాడు. వాని పెదవులపై పాలచారలున్నాయి. ఏమయిందని అడిగితే బిడ్డ ఏమీ పలుకలేదు. ఆయన వానిని బెదరించాడు. అంతట పిల్లవాడు పాడటం మొదలుపెట్టాడు. అది వానికి ప్రత్యక్షమైన శివుని స్తుతి - 'చెవిపోగులు ఉన్నవాడు, చోరుడును, ఉల్లమును దొంగలించినవాడును...'

జ్ఞానసంబంధర్ ఆ విధంగా సుప్రసిద్ధ భక్తుడైనారు. అందరూ ఆయన్ను చూడసెగబడేవారే. ఎంతో ఉత్సాహంతో, ఎప్పుడూ ఏదో ఒక సదుద్యమంగా ఆయన జీవితం గడిపారు. దక్షిణదేశంలో విస్తారంగా యాత్రలు చేసారు. 16వ ఏట ఆయనకు పెండ్లి చేసారు. వివాహోత్సవం కాగానే వధూవరులిద్దరూ ఆ ఊరిలోని గుడికి దేవదర్శనానికై వెళ్ళారు. వారితోబాటు బంధుమిత్రులెందరో అచటికి వెళ్ళారు. కాని వారి కెవ్వరికీ అక్కడ గుడి కనుపించలేదు. అది ఉండిన చోటెల్లా దివ్యజ్యోతిర్మయమై వెలిగిపోతోంది. ఆ కాంతిపుంజంలోంచి ఒక సన్నని దారి కనబడింది. జ్ఞానసంబంధర్ వారినందరినీ అందు ప్రవేశించమన్నారు. వారట్లే చేసారు. జ్ఞానసంబంధర్ వధువుతో గూడ ఆ తేజాన్ని ప్రదక్షిణించి, ఇతరులు వెళ్ళిన దారినే తామూ లోన ప్రవేశించారు. ఆ తేజస్సు మాయమైంది. అందు చొచ్చిన వారెవ్వరి జాడా కానరాలేదు. గుడి ఎప్పటిలాగానే గోచరించింది. అది ఆ యోగి మహిమాపూర్ణమైన సంక్షిప్త జీవితం.

ఆయన యాత్రల్లో ఒకమారు తిరువణ్ణామలైకు 18 మైళ్ళ దూరంలో నున్న అరయనైనెల్లూరు (అరగండనల్లూరు, తిరుక్కోయిలూర్)కు వచ్చారు. అచ్చటి శివుని గుడి చాల ప్రసిద్ధమైనది. (తన 17వ ఏట శ్రీభగవాన్ తిరువణ్ణామలై వస్తూ, 1500 ఏండ్ల క్రితం శ్రీజ్ఞాన సంబంధర్ చరణ చిహ్నాలచే పవిత్రమైన ఆ స్థలానికి చేరుకున్నారు. అది ఎట్లని భగవాన్ కప్పటికి తెలియదు. కాని వారికక్కడే దివ్యతేజో దర్శనమయింది.)

అరయనైనెల్లూరులో ఆ యతీంద్రులుండగా, చేతిలో పూలబుట్టతో ఒక ముదుసలి వారి దగ్గరకు వచ్చారు. నీవు ఎవరవన్న యతి ప్రశ్నకు బదులుగా అతడు తాను అద్రిరూప అరుణాచలేశుని పరిచారకుడన్నాడు.

యతి: ఆ కొండ ఇక్కడి కెంత దూరం?

వృద్ధుడు: నిత్యపూజకు పూలు ఏరుకోవడానికి రోజూ నే నిక్కడికి వస్తూంటాను

కాబట్టి అది దాపునే ఉండాలి.

యతి: అయితే నేనూ మీ వెంట అక్కడికి వస్తాను.

వృద్ధుడు: అరుదైనదీ సంతోషం. రండి.

వారిర్వురూ తోడవచ్చినవారూ, కలసిపోసాగారు. కొంతదూరం నడచిన పిదప ఆచోటు ఇంకా యెంత దూరమని అడుగుదామని యతి అటు చూచును గదా, ఆ వృద్ధు కనిపించలేదు. ఇంతలో ఒక దొంగల గుంపు వారిని చుట్టిముట్టింది. యాత్రికులందరూ తమ వస్తు ధనాలంతా దొంగల కర్పించుకున్నారు. ఎలాగో బయటపడి కాళ్ళీడ్చుకొంటూ వారు గమ్యం చేరుకున్నారు. ఆ యువయోగి ధ్యానమగ్నుడయ్యాడు. దైవం ప్రత్యక్షమై, ఆ దొంగలు తన పరిచారకులేనని తెలిపి, అతనికీ తోటివారికీ అవసరాలెల్ల తీరే ఏర్పాట్లు చేసారు. అప్పుడాయోగి ఆనందభరితుడై దైవాన్నెన్నో విధాల స్తుతించాడు. అందులో నొక స్తుతి -

"జ్ఞానఘన, భక్త జన దేహాత్మభావనను తొలగింపజాలెదవు. జింకలు అడవి పందులు నెలుగులును నీ కొండ సానువుల దిగి, రేల మైదానముల తిండికై నిచ్చ నడయాడు; మైదానముల వీడి ఏన్గు గుంపులు కొండదరులపై విశ్రమింపగనేగు.. నీ కొండచరియ లిటు బహుభిన్న మృగజంతుజాలముల కూడలులు....".

1500 ఏండ్ల క్రితం ఈ గిరి ప్రదేశం దట్టమైన అడవిగా ఉండి ఉండాలి. ఇన్ని శతాబ్దాలుగా వరుసగా కట్టెలకై చెట్లు కూల్చడంతో అడవి అదృశ్యమై రాళ్ళు మిగిలినవన్నారు శ్రీ భగవాన్.

దుర్జ్ఞేయుడైన ఆ ముదుసలి జ్ఞానసంబంధర్కు తెలిపిన అరుణాచలం వర్ణనము, ఉపమన్యుని 'భక్త చరిత్ర'లో 300 పద్యాల్లో నిబంధింపబడి ఉంది. దాని ప్రతి ఒకటి ఇటీవలి మాసాల్లో గుడివిషయంలో జరుగుతున్న కోర్టు వ్యాజ్యముల సందర్భంలో గుడి అర్చకుడు శ్రీ భగవాన్కు చూపటం తటస్థించింది. ఆ శ్లోకాలను భగవాన్ వ్రాసి యుంచుకొన్నారు.

## భాషణములు 530

అణ్ణామలైస్వామి డైరీనుండి ఈ క్రిందివిషయాలు సేకరింపబడ్డవి. ఆయన శ్రీ భగవాను లెడల శ్రద్ధాభక్తులున్నవారు, రమణాశ్రమవాసి.

శ్రీ రమణ భగవానుని ఉపదేశాలు :

1 ధ్యానాభ్యాసానికై గుహలోకి పోగోరిన స్వామితో శ్రీ భగవానన్నారు: "లోక వ్యవహారాల్లో ప్రకృతుడైయుండికూడా నిష్కాముడై, సారభూతమైన తన సహజ స్వభావాన్ని మరువని వాడే నిజమైన పురుషుడు."

2. అతడు సన్న్యాసము గూర్చి అడిగాడు. ముక్తికై సర్వాన్నీ త్యజించనక్కరలేదా?

మహర్షి: "నేను అన్నీ వదిలేసాను" అని భావించే వానికన్నా "నేను ఇది చేస్తున్నాను", "నేను కర్తను" అని అనుకోకుండా, తన బాధ్యతను తాను నిర్వహించే వాడు ఎంతో మేలు. "నేను సన్న్యాసిని" అనుకొనే సన్న్యాసి నిజమైన సన్న్యాసి కాజాలడు. కాని "నేను గృహస్థుడిని" అనుకోని గృహస్థుడు నిజమైన సన్న్యాసి.

## భాషణములు 531

భక్తుడు: ఒకరు ఒక విషయాన్ని ఒక విధంగా చెప్తే, వేరే వాళ్ళు అదే విషయాన్ని వేరే విధంగా చెప్తారు. సత్యాన్ని నిర్ధారించేదెలా?

మహర్షి: ప్రతివాడూ వాని ఆత్మనే చూస్తాడు. ఎప్పుడూ, అన్నిచోట్లా. ప్రపంచాన్నీ దైవాన్నీ గూడా తానున్న స్థితిని బట్టే చూస్తాడు.

ఒక నాయనార్ దేవదర్శనానికని కాళహస్తికి వెళ్ళాడు. వాని కందరూ శివుడుగా శక్తిగా కనుపించారు. తానట్టివాడే గనుక. ధర్మపుత్రుడు ప్రపంచంలోని జనులెల్లరూ ఏదో యొక విధంగా పుణ్యశీలురని, ఏదో ఒక కారణంగా తనకన్న గొప్పవారనీ భావించాడు. దుర్యోధనుని కింత ప్రపంచంలోనూ ఒక మంచివాడూ కనిపించలేదు. ప్రతివ్యక్తీ వాని స్వభావాన్నే ప్రతిబింబిస్తాడు.

## భాషణములు 532

భక్తుడు: ప్రపంచ దుఃఖాలనుండి తప్పించుకొనే మార్గమే లేదా?

మహర్షి: ఒకేయొక పద్ధతి ఉంది. ఎట్టి పరిస్థితుల్లోనూ తన ఆత్మను మరవకుండడమే ఆ మార్గం. ప్రపంచంలోని అన్ని కష్టములకు "నేను ఎవరు?" విచారమే మందు. అదే పూర్ణానందం గూడా.

## భాషణములు 533

ఎరవాడ జైలులో గాంధీజీ 21 రోజులుపవాసముంటారన్న వార్త ప్రచురించగానే ఇద్దరు యువకులు భగవాను వద్దకు వచ్చారు. వారుద్విగ్నులై యున్నారు. వారన్నారు -

గాంధీజీ 21 రోజు లుపవసించనున్నారు. మేముగూడ అక్కడికే వెళ్ళి ఆయనతోబాటు అన్నిరోజులూ ఉపవసించ నిశ్చయించి భగవాన్ అనుమతికై వచ్చాము. దయచేసి అనుమతించండి. అచటికి పోవాలని ఎంతో ఆతురతగా ఉంది' అని అంటూనే వారు తొందరగా వెళ్ళాలని ఉత్సాహం చూపారు. శ్రీ భగవాన్ నవ్వి యన్నారు - 'మీకిట్టి భావములుండటం మంచిదే. కాని మీరిప్పుడు చేయగల్గిందేమి? తన తపంతో గాంధీజీ సాధించిన శక్తిని మీరు ఆర్జించండి. ఆ పిదప మీకు విజయం కల్గుతుంది.'

## భాషణములు 534

మౌనాన్ని పరిపూర్ణమైన వాగ్ధాటిగా శ్రీభగవాన్ ఎన్నోమార్లు చెప్పియున్నారు. శాంతి పరిపూర్ణమైన క్రియాశీలత. ఎలా? ఎందుకంటే అందు వ్యక్తి తన సహజ స్థితిలో ఉంటాడు; అందువల్ల ఆత్మలో అంతరాంతరాల్లో సర్వమయుడై యుంటాడు. ఎచ్చట, ఎప్పుడు, ఏ శక్తి అవసరమో దాన్ని వర్తిల్లచేయగలడు. అది ఉత్తమోత్తమ సిద్ధి.

అణ్ణామలై: నామదేవ్, తుకారాం, తులసీదాసాదులు మహావిష్ణువును చూసినట్లు చెప్పియున్నారు. వారెట్లు వారిని చూడగల్గారు?

మహర్షి: ఏ విధంగానా? నిన్ను నేనూ, నన్ను నీవూ చూస్తున్న విధంగానే విష్ణువును గూడ చూచియుంటారు.

(అది వినగానే తన మేను గగుర్పొడిచిందని, తనకెంతో ఆనందం కలిగిందని అణ్ణామలై తన జ్ఞాపకం కోసం వ్రాసుకొన్నారు)

## భాషణములు 535

అణ్ణామలై అడిగారు: దైనందిన కార్యక్రమాలు చేసుకుంటూ భగవంతుని యందు ఆరాధనాపరంగా ఉండడం ఎలా?

శ్రీభగవాన్ బదులీయలేదు. అలా పదినిముషాలు గడిచాయి. ఇంతలో కొందరు బాలికలు హాలులోనికి వచ్చి నృత్యం చేస్తూ పాడసాగారు. "అందరమూ పాలు చిలుకుతూనే ఉంటాము. కాని కృష్ణుని తలపోయడం క్షణమైన మానము." శ్రీ భగవాన్ స్వామివైపు తిరిగి మీ ప్రశ్న కాపాటలోనిది సమాధానం. ఆ స్థితినే భక్తి, యోగ, కర్మము లంటారు.

## భాషణములు 536

దేహాత్మ బుద్ధిలో ("నేను దేహము") అనే భావనలో మునిగినవాడు అత్యంతము పాపి, ఆత్మహంతకుడూను. తానాత్మనన్న అనుభవం పరమపుణ్యం. ఆ ఉద్దేశ్యం తోడి ధ్యానం ఒక్కక్షణమే యైనా సంచిత కర్మనెల్ల నశింపచేసే దానికి సమర్థమైంది. అది చీకట్లను తొలగించే సూర్యునివంటిది. నిరంతర ధ్యాననిష్ఠుని ధ్యానం తర్వాత ఎంత ఘోరమైన పాపమైనా మిగిలియుండ గలదా?

## భాషణములు 537

ఒకమారు భగవానన్నారు. 'కామమే' (కోరికయే) మాయ; నిష్కామమే (కోరికలు లేకపోవడమే) దైవం'.

## భాషణములు 538

అణ్ణామలై అడిగారు: లోకప్రవృత్తికి, ధ్యానానికి యథార్థభేదమేమి?

మహర్షి: భేదమేమీ లేదు. ఒకే వస్తువుకు రెండు వేర్వేరు భాషలలో రెండు వేర్వేరు పదాలతో పేరు పెట్టడం వంటిది. కాకికి కండ్లు రెండున్నా, కంటిపాప ఒకటే. అది ఎటు చూడవలసియుంటే, పాప ఆ కంటిలోకి తిరుగుతుంది. ఏనుగుతొండము ఊపిరినీ, నీటినీ గూడ పీలుస్తుంది. పాముకు చూడటానికి వినడానికి అవయవమొక్కటే.

## భాషణములు 539

శ్రీ భగవాన్ కొండపైకి వెళుతున్నపుడు అణ్ణామలై అడిగారు. కండ్లు తెరచియుంచటం, మూయడం - వీనివల్ల ధ్యానంలో ఏమైనా భేదముంటుందా?

మహర్షి: కొంత దూరం నుంచి బంతిని ఎదుటిగోడపై విసరితే, అది చెంగున నీవైపే తిరిగివస్తుంది. గోడకు దగ్గరగా ఉంటే, ఆ బంతి ఎగిరి నీకు దూరంగా పోతుంది. కండ్లు మూసుకున్నా మనస్సు ఆలోచనలను అనుసరిస్తుంది.

## భాషణములు 540

అణ్ణామలై: ఇంద్రియ భోగాల్లోకన్న ధ్యానంలోనే సుఖమెక్కువ. అయినా మనస్సు ఆ మొదటివాని వైపే పరుగిడుతూ రెండవ దాన్ని లక్ష్యపెట్టదు. ఎందుచేత?

మహర్షి: సుఖదుఃఖాలు మనోదశలు మాత్రమే. మన సహజ స్వభావం ఆనందం. కాని మనం ఆత్మను మరచిపోయాము. దేహాన్నో, మనస్సునో ఆత్మయని భ్రమ చెందుతున్నాము. ఆ మిథ్యా తాదాత్మ్యమే దుఃఖాన్ని కల్గిస్తుంది. ఏమి చేయడం? వాసనలు ఎప్పుడూ బహుజన్మలుగా వస్తున్నవి. అంచేత అవి బలపడ్డవి. సహజస్థితి, అంటే ఆనందం, తన ఉనికిని నిలుపుకోవాలంటే ఆ వాసనలు పోయితీరాలి.

# భాషణములు 541

ఒక దర్శనార్థి అడిగాడు: ప్రపంచంలో ఎనలేని దుఃఖముంది. ఎందుకంటే దుష్టులే లెక్కకు మీరి యున్నారు. ఇక్కడ ఆనందం ఎలా పొందగలం?

మహర్షి: మనకందరూ గురువులే. దుష్టులు వారి చెడుచేతలతోనే చెప్తున్నారు. “మా దగ్గరికి రావద్దు” అని. సజ్జను లెప్పుడూ సజ్జనులే. ఈ రీతిగా అందరూ మనకు గురువులవంటివారే.

# భాషణములు 542

అణ్ణామలై అడిగారు: నాకు వలసినవన్నీ సులభంగా లభిస్తూ, నాకుగల కాలాన్నంతా ధ్యానానికే వినియోగించగల ఏకాంత జీవితం పలుమార్లు కోరుకుంటాను. అట్టి కోరిక మంచిదా, చెడ్డదా?

మహర్షి: అట్టికోరికలు తీరడానికై మరొకజన్మవస్తుంది. ఎక్కడ, ఎలా ఉంటేమాత్రం నీకేమి? మనస్సు తన మూలంలో సదా నిలువడం ముఖ్యం. అంతరం కానిదేమీ బాహ్యంలో లేదు. మనస్సే అన్నీను. మనస్సు ప్రవృత్తమైతే ఏకాంతం గూడ ఒక సంతవలె ఉంటుంది. కండ్లు మూసుకొన్నంత మాత్రమున ప్రయోజనం లేదు. మనోనేత్రాన్ని మూయగల్గితే, అంతా చక్కబడుతుంది. ప్రపంచం నీకు బాహ్యంగా లేదు. ఆచరణకు ముందు సజ్జను లేప్రణాళికలూ తయారు చేయరు. ఎందుకంటే, మనలను ఇక్కడికి పంపిన భగవంతునికి ఆయన ప్రణాళిక ఆయనకి ఉంది, అది ఎలాగూ జరిగేతీరుతుంది కనుక.

# భాషణములు 543

ఒకసారి చాలామందివచ్చి భగవాన్కు నమస్కరించి ఏకకంఠంగా “మమ్ములను భక్తులను చేయండి, మాకు మోక్షమీయం"డని కోరారు. వారు వెళ్ళిన తర్వాత అందరూ వినేట్టుగానే శ్రీభగవాన్ అన్నారు. - 'వాళ్ళందరికీ భక్తిముక్తి కావాలి. ఒకవేళ నేను వారికి "నిన్ను నాకు సమర్పించుకో” అంటే వాళ్ళు వినరు. మరి వారికి కావలసింది లభించెదెలా?

# భాషణములు 544

ఒక మారాశ్రమభక్తులు కొందరు తమలోతాము సుప్రసిద్ధ భక్తుల తరతమాల చర్చిస్తున్నారు. వారిలో ఏకాభిప్రాయం కుదరక శ్రీభగవాన్ అభిప్రాయమేమని అడిగారు. వారు ఊరుకున్నారు. వారి చర్చ బాగా వేడెక్కింది.

చివరకు భగవానిట్లన్నారు: ఒకరింకొకర్ని తెలుసుకోవడం సాధ్యపడదు. అలాగే ఒకర్ని బద్ధుణ్ణి చేయడంగాని, ముక్తుణ్ణి చేయడంగాని సాధ్యపడదు. ప్రతివాడూ ప్రపంచంలో ప్రసిద్ధి గోరేవాడే. అది మానవ సహజం. కాని కోరిక మాత్రానికే లక్ష్యం సిద్ధించదు. దైవంచే అంగీకరించబడనివాడు అవమానం పాలుగాక తప్పదు. తనుమనములతో తన్ను భగవదర్పణం చేసుకున్న వాడు ప్రపంచంలోనెల్ల ప్రసిద్ధుడు అవుతాడు.

# భాషణములు 545

అణ్ణామలై ఒకమారు కామవాంఛతో చాల సతమతమైనాడు. ఆ ఆలోచనలతో యుద్ధం చేసాడు. మూడురోజు లుపవసించాడు. తనకా ఆలోచనలనుండీ ముక్తికలగాలని భగవంతునెంతో ప్రార్థించాడు. చివరకు ఈ విషయంగా భగవన్తో సంప్రదింప నిశ్చయించాడు.

చెప్పిందంతా ఓపికగా విని, భగవాన్ రెండు నిమిషములు మాటాడలేదు. తరువాత అన్నారు - సరి, ఆ ఆలోచనలు నీకు విక్షేపం కలుగచేసాయి. నీవు వాని నెదుర్కొన యత్నించావు. అది మంచిదే, కాని ఇంకా ఇప్పుడూ వాని గూర్చి యోచించడమెందుకు? అట్టి ఆలోచనలు రాగానే అవి వచ్చిన దెవరికో పరికించు; అవి నిన్ను వీడి పారిపోతాయి.

## భాషణములు 546

అణ్ణామలై అడిగాడు: ఒకడు మంచే చేసాడు. కాని చేస్తున్నది మంచే అయినా అప్పుడప్పుడు వాడు బాధపడక తప్పదు. మరొకడు దుర్మార్గపు పనులే చేస్తాడు. కాని సుఖంగానూ ఉంటాడు. అలా ఎందుకు జరుగుతుంది?

మహర్షి: సుఖదుఃఖాలు గతంలోని కర్మలఫలము; ఇప్పటి కర్మలవికావు. సుఖదుఃఖాలు ఒకటివెంట నొకటిగా వరుసగా వస్తాయి. సహించుటో, సంతోషించుటో ఓర్పుతో చేయాలి. కాని, వానివెంట కొట్టుకొని పోరాదు. ఎప్పుడూ ఆత్మనంటిపెట్టుకోవడానికి యత్నించాలి. కార్యపరతలో ఫలితముల లెక్కింపరాదు. అపుడపుడు కలిగే కష్టసుఖాలకు కలత చెందరాదు. కష్టసుఖాలంటే నిస్పృహగలవాడే (ఉదాసీనంగా ఉన్నవాడే) నిజంగా ఆనందంగా ఉండగలడు.

## భాషణములు 547

భక్తుడు: ముక్తి లభించుటలో గురువనుగ్రహానికి గల ప్రాధాన్యమెట్టిది?

మహర్షి: ముక్తి నీకు వెలిగా ఎక్కడా లేదు. అది నీలోనేఉంది. ముక్తికై నిజంగానే ఆతురుడైనవాణ్ణి లోనిగురువులోనికి లాగుకొంటాడు; బయటనున్న గురువు లోనికి త్రోస్తాడు. గురువు అనుగ్రహమిదే.

## భాషణములు 548

దర్శనార్థి డొకడు వ్రాతమూలకంగా భగవాన్ నిట్లు ప్రశ్నించాడు ...

1. జగత్తులోని భేదాలు సృష్టికి సమకాలీనాలా, కాక ఆ పిమ్మటివా? 2. సృష్టికర్త నిష్పక్షపాతియేనా? అయితే ఒకడు కుంటి, మరొకడు గ్రుడ్డి వేరొక డింకొకటిగా జన్మించుటేల? 3. అష్టదిక్పాలురూ, ముప్పది మూడుకోట్ల దేవతలూ, సప్తర్షులూ నేటికినీ ఉన్నారా?

మహర్షి: అట్లు నిన్నే నీవు ప్రశ్నించుకో, సమాధానం దొరుకుతుంది.

కొంతసేపాగి భగవాన్ వచించారు -- మొదట తానెవరో తెలిస్తే ఇతర విషయాలన్నీ విశదమౌతాయి. తన్నెరిగిన పిదప సృష్టి స్రష్టల విషయం విచారించవచ్చు. తన్ను తానెరుగకే దైవాన్నెరుగ యత్నించడం అజ్ఞానం.

పచ్చకామెర్లవాని కంతా పచ్చగనే కన్పిస్తుంది. అంతా పచ్చగనే వుందని వాడంటే ఎవరు ఒప్పుకుంటారు?

సృష్టికొక ఆది ఉందంటారు. ఎలా? చెట్టు విత్తనాల లాగ. విత్తనమెట్లు పుట్టింది? సాటి చెట్టునుంచి. ఈ ప్రశ్నల పరంపర కంతేమిటి? అంచేత మొదట తన్ను తానెరిగితే, ప్రపంచాన్ని తర్వాత తెలిసికోవచ్చు.

## భాషణములు 549

శ్రీ భగవాన్ తరుచుగా నమస్కారాన్ని గూర్చి ఇలా అనేవారు: మొట్టమొదట ప్రాచీన ఋషులు భగవత్ శరణాగతికి సాధనంగా నమస్కారాన్ని ఉద్దేశించారు. ఆచరణ ప్రాయంగా అది మిగిలింది. కాని దాని వెనక భావం లోపించింది. నమస్కరించేవాడు తన చర్యతో నమస్కారము తీసుకుంటున్నవాడ్ని మోసగింపచూస్తాడు. అది చాలా వరకు కపటము

వంచనతో కూడినది. అది లెక్కలేని పాపాలను దాచేందుకై తెర. దైవాన్ని మోసగించగలమా? తన నమస్కారం దైవం గ్రహించాడనీ, పూర్వంలాగే తన జీవితం ఇక సాగించవచ్చనీ వాని భావన. వాళ్ళు నా దగ్గరకు రానక్కరలేదు. వారి నమస్కారాలు నాకెట్టి తృప్తినీ ఈయవు. వాళ్ళు తమ మనస్సులను నిర్మలంగా ఉంచుకోవాలి. అది చేయకుండా నా ముందు వంగుతారు లేదా సాగిలబడతారు. అట్టి చర్యలతో నేను మోసపోయేది లేదు.

## భాషణములు 550

సోమర్సెట్ మామ్ ప్రసిద్ధ ఆంగ్లేయ రచయిత. శ్రీ భగవాన్ దర్శనానికై వచ్చిరి. ఆయన చాడ్వికన్ను చూడటానికై అతని గదికి వెళ్ళారు. అక్కడ ఉన్నట్లుండి అచేతనంగా పడిపోయాడు. చాడ్విక్ భగవానుకిది తెల్పి అతన్ని చూడమని అర్థించాడు. శ్రీభగవాన్ ఆ గదికి వెళ్ళి ఆసీనులై వానివంకే దృష్టి సారించారు. కొద్ది సేపటికి వానికి స్మృతి వచ్చింది. అతడు భగవాన్కు నమస్కరించాడు. ఇర్వురూ ఒకరినొకరు చూస్తూన్నారు. ఒక గంట గడిచింది. ఆ రచయిత ప్రశ్నలను అడగాలని ప్రయత్నించాడు. కాని మాట్లాడలేదు. భగవాన్న ఏమైనా అడుగుమని చాడ్విక్, మామ్ను ప్రోత్సహించాడు. శ్రీ భగవాన్ అన్నారు - 'అంతా అయిపోయింది. సంవాదమంతా హృదయ సంవాదమే. అన్ని భాషణలూ నిశ్శబ్దంలోనే పర్యసించాలి" వారు చిరునవ్వు నవ్వుతుండగా భగవాన్ అటనుండి నిష్క్రమించారు.

## భాషణములు 551

భక్తుడు: ఆత్మవిద్య అతి సులభమని ఎలా చెప్పబడింది?

మహర్షి: మరే విద్యకైనా జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము ఈ మూడూ కావాలి. దీనికి అవేవీ అక్కరలేదు. అది తానే. ఇంతకన్న విస్పష్టమైనది వేరేమి? అందుచేతే అది సులభం. నీవు చేయవలసిన సర్వమూ నేనెవరన్న విచారమే.

మానవుని నిజమైన పేరు ముక్తి. (మోక్షము)

## భాషణములు 552

ఆశ్రమంలో కొన్ని కట్టడాలున్నవి. వానికేవో ప్లానులున్నవి గాని పూర్తిగ వాని ప్రకారమే ఆ నిర్మాణం సాగలేదు. అణ్ణామలైకు మరియు సర్వాధికారికి చాల అంశాల్లో భేదాభిప్రాయాలు వచ్చి, ఒకరొకరికి పడలేదు. అణ్ణామలైకు ఒక మారు విపరీతంగా విసుగు వచ్చింది. ఈ స్థితుల్లో ఏం చేయమంటారని ఆయన శ్రీభగవాన్ ను అడిగారు.

శ్రీభగవాన్ అన్నారు: ఇచటివారు ఏ కట్టడాన్ని యే ప్లాను ప్రకారం కట్టారు గనుక? దైవం వేసియుంచిన ప్లాను పాలించబడుతుంది. ఏం జరుగుతుందో దాని గురించి ఎవరూ చింతించవలసిన అవసరం లేదు.

## భాషణములు 553

ఆశ్రమవాసులు భగవాన్నడిగారు - 'మా పూర్వ జన్మలో మే మెవరం? గతంలోని విషయాలు మాకు ఏల జ్ఞప్తికి రావు?'

మహర్షి: దేవుని కృప ఎంతటిదో కదా, మీకవి స్మృతికి రానీయదు. తాము పుణ్యశీలురని తెలిస్తే వారికి గర్వం కలుగుతుంది? పాపులేయైయుంటే, వారికెంత నిరుత్సాహం దిగులూ కల్గుతాయి. ఇందులో ఏదీ మంచికిగాదు, తన్ను తానెరిగితే అదే చాలు.

## భాషణములు 554

మహర్షి: సముద్రం చేరాక నదికి ప్రవాహం ఆగినట్లే మనుజుడు గూడ ఆత్మలో లీనమైనాక అన్ని కర్మలూ ఆగిపోతాయి.

## భాషణములు 555

ఒకమారు కావ్యకంఠ గణపతులు ఇలా అడిగారని భగవాన్ గుర్తుచేసుకున్నారు 'జీవితం గడపటానికి మనిషికి నెలకు మూడు రూపాయలు చాలునని నా 'అభిప్రాయం' శ్రీ భగవానేమంటారు?

మహర్షి: తన బ్రదుకునకై తనకు కావలసిందేమీ లేదని తెలుసుకున్నవాడు ఆనందంగా బ్రతక వచ్చు.

## భాషణములు 556

ఒకరాత్రి చాడ్విక్ శ్రీ భగవాన్నడిగాడు: మనస్సు వ్యక్తమయ్యాక ప్రపంచం వ్యక్తమౌతుందన్నారు. నిద్రలో మనస్సు లేదు. ఆ సమయంలో ఇతరులకు ఈ ప్రపంచముండదా? దీని వలన ప్రపంచం విశ్వమనస్సు యొక్క ఫలితమని తెలుపడం లేదా? అప్పుడు ఈ ప్రపంచం భౌతికం కాదనీ కలవంటిదని ఎలా చెప్పగలం?

మహర్షి: ప్రపంచం వ్యక్తి మనఃకల్పితమో, విశ్వమానస కల్పనో, అదిగా నీకు చెప్పదు. వ్యక్తి మనస్సు ప్రపంచాన్ని గుర్తిస్తుంది. ఆ మనస్సు లేనప్పుడు ఆ ప్రపంచమూ లేదు.

కలలో ఒకడు, ముప్పై ఏండ్లు క్రితం చనిపోయిన తండ్రిని చూచాడు. తనకు నల్గురన్నదమ్ములు. తండ్రి వారందరికి గూడా ఆస్తిని పంచిపెట్టాడు. తగువు వచ్చింది. వారందరూ కలిసి ఇతన్నీ చితకమోదారు. భయంతో వాడు మేల్కొన్నాడు. అంతట వానికి తెలిసింది తన కేసోదరులూ లేరనీ, తానొక్కడనేయనీ, తండ్రి చనిపోయి ఎంతోకాలమైందనీ, అంత వానికి భయం వదిలిపోయి, తృప్తి కల్గింది. చూచావా, ఆత్మను చూసినప్పుడు ఈ ప్రపంచం లేదు, ఆత్మనే మరిచితిమా, ప్రపంచ బంధనాల్లో చిక్కుకుంటాము.

## భాషణములు 557

భక్తుడు: దృష్టిని భ్రూమధ్యంలో నిల్పుమన్నారు. సరియేనా?

మహర్షి: తానున్నానని ప్రతివానికీ తెలుసు. ఆ ఎరుకను వదలి, దైవాన్ని వేరుగా వెదుకబోతారు. భ్రూమధ్యంలో దృష్టినిల్పి ప్రయోజనమేమి? దైవమక్కడ ఉన్నాడనటం తెలివితక్కువ, అట్లు చేయుమన్న సలహా చిత్తైకాగ్రత కుదరటానికి. మనస్సు చెదరక నిలిపే ప్రబల సాధనల్లో అది ఒకటి. అది మనస్సు నొకే మార్గంలో బలవంతంగా పంపించడానికి ఉపయోగపడుతుంది. ఏకాగ్రత కది సాయంచేస్తుంది.

కాని ఆత్మానుభవానికి అత్యుత్తమ ఉపాయం "నేను ఎవరు" విచారణే. ప్రస్తుత కష్టం మనస్సుకు. ఆ మనస్సును మనస్సుతోనే తొలగించాలి.

భ: ఏవైన ఆహారనియమాలు పాటించాలా?

మ: సాత్త్వికాహారం మితంగానైతే మంచిది.

భ: బహువిధములైన ఆసనములు చెప్పియున్నారు. వానిలో శ్రేష్ఠమేది?

మ: నిదిధ్యాసనం (చిత్తైకాగ్రత) అన్నిటికన్న మేలు.

## భాషణములు 558

భక్తుడు: 'శ్రీభగవాన్! మీగురించి వినగానే మిమ్మల్ను చూడవలెనన్న కోరిక గాఢంగా కల్గింది. ఎందువల్ల అది కల్గింది?

మహర్షి; ఆత్మకు దేహం ఎలా వచ్చిందో అదే విధంగా ఆ కోరిక కల్గింది?

భ: జీవితోద్దేశమేమి?

మ: జీవితానికర్థం తెలిసికోవాలనే కోరికే పూర్వజన్మ సుకృతఫలం. అట్టి జ్ఞానమును కోరని వారు ఊరకనే తమ జీవితాలు వ్యర్థం చేసుకుంటున్నారు.

## భాషణములు 559

నేను జ్ఞానినెప్పుడౌతానో శ్రీభగవాన్ తెలిసికోగలరు. అది ఎప్పుడో దయచేసి చెప్పండి, అని ఒక వ్యక్తి అడిగాడు.

మహర్షి: నేను భగవంతుణ్ణయితే, జ్ఞానం కలుగడానికిగాని, నేను మాట్లాడటానికిగాని నాకు వేరుగా ఎవరూ లేరు. ఇతరులలాగే సామాన్య మానవుడనే అయితే వారివలెనే నేనూ అజ్ఞానినే. నీ ప్రశ్నకు సమాధానం ఏ విధంగానూ చెప్పడం సాధ్యంగాదు.

## భాషణములు 560

శ్రీ భగవాన్ స్నానం చేస్తున్నారు. ఆయన సమీపంలో భక్తులు తమలో తాము మాట్లాడుకుంటున్నారు. వారిలో ఒకరు గంజాయి ఉపయోగమేమని భగవాన్నడిగారు. అప్పటికి వారి స్నానం ముగిసింది. వారన్నారు 'గంజా'నా? దాని ప్రభావమున్నంత సేపూ అది పుచ్చుకొన్న వాడానంద తన్మయుడుగా ఉంటాడు. ఆ అనందాన్ని నేనేమని వర్ణించేది? వా'దానంద, మానంద'మని కేకలు వేస్తాడు. అంటూ భగవాన్ మత్తెక్కిన వానివలె తూగుతూ నడిచారు. భక్తులు నవ్వసాగారు. భగవాన్ తూలిపడబోతున్నట్లుగా (అణ్ణామలైస్వామిని) చేతులతో చుట్టి 'ఆనంద మానంద'మని కేకలు వేసారు.

ఆనాటినుండి తన జీవితమే మారిపోయిందని అణ్ణామలై తన డైరీలో వ్రాసారు. ఎనిమిదేండ్లుగా అతడాశ్రమంలో ఉన్నాడు. అప్పటినుండి తన మనస్సెప్పుడూ ప్రశాంతంగా ఉందన్నారు.

## భాషణములు 561

మనస్సు యొక్క స్వరూపమేమి, అరూపమేమి?

మహర్షి: నీవు నిద్ర నుంచి మేల్కొన్నప్పుడు ఒక వెలుగు కనుపిస్తుంది. అది మహతత్త్వం ద్వారా పోతున్న ఆత్మప్రకాశం. దానిని విశ్వచైతన్య మన్నారు. అది అరూపము. ఆ తేజం అహంకారముపై పడి ప్రతిఫలిస్తుంది. అప్పుడు దేహమూ ప్రపంచమూ గోచరిస్తాయి. ఈ మనస్సు స్వరూపము. ఈ ప్రతిబింబిత చైతన్య కాంతిలో విషయాలు అగుపిస్తాయి. ఈ కాంతిని 'జ్యోతి' అంటారు.

## భాషణములు 562

భక్తుడు: విచార సంగ్రహంలో ఒక వచనం ఉంది. ఆత్మదర్శనం ఒకమారైనంతనే ఆ ఒక్క కారణంచేతనే, అతడు ముక్తుడు కాజాలడు. అతడు వాసనావశుడయ్యే చరిస్తాడు. అతని ఆత్మదర్శనం జ్ఞానికి వలెనేనా? అలా అయితే ఫలితాలలో తేడా ఎందుకు వచ్చినట్లు?

మహర్షి: అనుభవమొక్కటే. తెలిసియో, తెలియకో ప్రతివానికీ ఆత్మానుభవం ఉంది. అజ్ఞాని అనుభూతిని వాసనలు కప్పియుంచుతాయి. జ్ఞాని విషయంలో అట్లుగాదు. అందువల్లనే జ్ఞానియొక్క ఆత్మానుభవము విశిష్టమూ, శాశ్వతమూ, సాధకుడు దీర్ఘకాలం అభ్యాసం చేస్తూ ఒక తళుకువలె సత్య దర్శనం చేయవచ్చు. అప్పటికి మటుకు ఆ అనుభవం విశదంగానూ ఉండవచ్చు. కాని వాసనలు వానికి విక్షేపం కల్గించి, వాని యా అనుభూతిని ఏ విధంగానూ ఉపకరించనీయవు.
అట్టివాడు మనన, నిదిధ్యాసనాదులను చేస్తూనే ఉండాలి. దాని వలన ఆటంకాలన్నీ నిర్మూలించబడతాయి. ఆపైన అతడు సదా ఆ సతిస్థితిలోనే ఉండిపోతాడు.

భ: ఏ యత్నమూ చేయక అజ్ఞానిగనే ఉండిపోయే వానికిని, ఆత్మ దర్శనం ఒక తళుకువలె కలిగి తిరిగి అజ్ఞానవశుడైన వానికి గల భేదమేమి?

*మ: ఆ రెండవవానికి కల్గిన స్వల్పకాల అనుభూతి పూర్ణ అనుభూతిగా మారే వరకు వానిని మళ్ళీ మళ్ళీ యత్నింప ప్రోత్సహించే శక్తి స్థిరంగా ఉంటుంది.

భః శ్రుతులు 'సకృత్ విభాతోయం బ్రహ్మలోకః' (బ్రహ్మలోకం ఒకేమారు

నిత్యమై భాసిస్తుంది) అన్నవి. మః అవి శాశ్వతానుభవాన్ని ప్రస్తావించేవి, స్వల్పకాల తళుకువలె అనుభవ విషయం కాదు.

భ: తన అనుభూతిని మరచి తిరిగి అజ్ఞానవశుడు కావడం ఎలా సాధ్యం?

సాధ్యమనేదాని కుదాహరణగా శ్రీభగవాన్ ఈ కథ చెప్పారు:

ఒక రాజున్నాడు. ప్రజల్ను చక్కగా పాలించేవాడు. వాని మంత్రుల్లో ఒకరు రాజు నమ్మకాన్ని సంపాదించి తన లాభానికై దుర్వినియోగం చేసాడు. ఇతర మంత్రులూ, అధికారులూ అందువల్ల కష్టనష్టాలకు గురియైరి. వారంతా కలిసి ఈ మంత్రిని వదల్చుకొనే ఎత్తువేసారు. వానిని రాచనగరులోనికి రానీయవద్దని మందిరపాలకుల నాదేశించారు. ఆ మంత్రి రాకపోవటం రాజు గుర్తించాడు. అడిగితే అతడు జబ్బుపడ్డాడని, నగరుకు రాలేకపోయాడని అన్నారు. ఆ రాజాతని జబ్బునయం చేయమని తన వైద్యుణ్ణి పంపాడు. రాజుకుచేరే వార్తలు వట్టికల్లలు మంత్రి ఒకమారు కోలుకుంటున్నాడనీ, మరో మారు జబ్బు తిరగబెట్టి దిగజారుతున్నాడని ఏవేవో కబుర్లు. రాజు స్వయంగా వెళ్లి మంత్రిని చూడసెంచాడు. కాని పండితులది ధర్మవిరుద్ధమన్నారు. ఆ తర్వాత మంత్రి చనిపోయాడన్న వార్త రాజుకందింది. రాజు చాల విచారించాడు.

ఈ వ్యవహారాలన్నీ తన గూఢచారుల మూలంగా గమనిస్తున్న మదోన్మత్తుడా మంత్రి ఎదురుపన్నాగమొకటి వేసాడు. ఎట్లైనా రాజొక్కమారు నగరు వెలికి వచ్చేటైతే తానాతని కంటబడ వీలవుతుంది. ఒకరోజు రాత్రి రాజు పల్లకిలో గూర్చుండి నగరు బయటకు వెళ్ళాడు. ఒక ఎత్తైన చెట్టు ఎక్కి ఆకుల గుబురులో దాగియున్న ఆ మంత్రి పల్లకి ప్రక్కనే దూకి బిగ్గరగా తాను ఫలానాయని అరిచాడు. కాని రాజునొద్ద పరిజనం కొంచెం సమయ స్ఫూర్తిని ప్రదర్శించారు. ఒకడింత విభూతి తక్షణం బయటకు తీసి గాలిలో ఎగురువేశాడు. అది కంట్లో పడకుండా రాజు కండ్లు మూసుకొన్నాడు. ఆ పరిచారకుడు రాజుకు జయజయ ధ్వానాలు చేసాడు. నగారానౌబత్తులు మ్రోగాయి. మంత్రిగొంతు వినరాలేదు. పల్లకీబోయలు త్వరగా

ముందుకు సాగారు. ఆ పరిజనుడు స్వయంగా ఉచ్చాటనా మంత్రాలు వల్లిస్తూ బిరబిర ముందు నడిచాడు. అది ఆ మంత్రి పిశాచమనీ, దానిచేష్టలేవో తనపై చూపవచ్చిందనీ, రాజుకు నమ్మకం కుదిరింది.

బిక్కచచ్చి ఆ మంత్రి నిరాశహతుడై అడవులకేగి తపమొనర్చ నారాంభించాడు. చాలాకాలానికి రాజు వేటకై అటువైపు వెళ్ళి అతనికి కనబడ్డాడు. అతడు గాఢ ధ్యాననిష్ఠలో ఉన్నారు. కాని అతడు పిశాచమన్న భ్రాంతి ఇంకనూ వదలని రాజు పరుగులంకించుకొన్నాడు.

ఈ కథనుండి తెలిసే నీతి ఏమిటింటే మనిషిని రక్తమాంసాలతో చూచినా అతడు పిశాచమన్న మిథ్యాబుద్ధి సరియైన జ్ఞానాన్ని రానీయలేదు. బలాత్ ఆత్మదర్శనం దానికి సదృశమైనది.

## భాషణములు 563

జనుల గుంపొకటి భగవాన్ను చూడవచ్చింది. అందొకరు ప్రశ్నించారు. మనస్సును సరిగా నే నెట్లు నిలిపేది?

మహర్షి: బరితప్పిన గెదెను కొట్టంలోకి తీసుకురావడానికి పచ్చిగడ్డి నాశ జూపుతారు. అలాగే సదాలోచనలతో మనస్సును ఆకట్టుకోవాలి.

భ: కాని అది నిశ్చలంగా ఉండదే.

మ: బయట తిరగడం కలవాటైన గేదెకు బయట తిరగడమే సరదా. దాన్ని కొట్టం జేర్చడానికి ఏపుగాపెంచిన పచ్చిగడ్డియే మార్గం. అప్పటికీ అది ఇరుగుపొరుగు పొలాలు తిరుగుట మానదు. ఆ పొలాల్లో లాంటి గడ్డే, తాను కొట్టంలోనున్నా ఆచీ) లభిస్తుందన్న నమ్మకం దానికి క్రమంగా కల్గించాలి. కొంతకాలానికది కొట్టంలో ఉండిపోవడం నేర్చుకుంటుంది. తరువాత తరువాత దాన్ని బయటకి తరిమినా పొరుగుపొలాల్లో పడక, తిన్నగా కొట్టానికే వచ్చేరోజులొస్తాయి. అలాగే మనస్సును సరియైన మార్గాన నడిచేట్లు నేర్పాలి. క్రమంగా అది ఋజుపద్ధతి కలవాటుపడి చెడుదారులలో పోదు.

భ: మనస్సుకు చూపదగ్గ సన్మార్గాలేవి?

మ: దైవచింతన. (భగవంతుని ఆలోచన)

## భాషణములు 564

కాశ్మీరులో ఒక జాగీర్దారు, పండిత బాలకాక్ ధార్, శ్రీనగర్నుండి ఇంతదూరమూ పనిగట్టుకొని దీపావళినాటికి, భగవాన న్ను చూడవచ్చాడు. పెద్దకాగితాల్లో తన జీవితం స్థితిగతులూ అన్ని వివరాలూ వ్రాసి శ్రీభగవాన్ చేతికిచ్చాడు. భగవాన్తో ఆయన మాట్లాడిందంతా వ్యక్తిగత విషయాలే.

అందులో ఒక ప్రశ్న:

ఇక శ్రీ భగవాన్ దర్శనం అయింది కనుక, అదే చాలు. ఇంక ఈ పూజలూ, తంత్రాలూ మంత్రించిన తాయెత్తులూ అన్నీ నదిలో పారేయనా?

మహర్షి: ధర్మశాస్త్రాలు చెప్పిన విధంగా నిత్యపూజ ఎప్పుడూ మంచిదే. అందువల్ల మనశుద్ధి కలుగుతుంది. సాధనలో పూజలదశ దాటినానని వ్యక్తి భావించినా ఇతరులకొరకైనా ఆ పూజలు చేయాలి. అది తన బిడ్డలకు, ఇతర పరిజనానికి ఆదర్శమవుతుంది.

ఒక మైసూరువాసి అడిగేరు -

మనస్సును సరియైన మార్గాన ఉంచేదెలా?

మహర్షి: సాధనవల్ల. దానికి మంచి ఆలోచనలు ఇవ్వు. మనస్సును మంచిదారిలో చరించేట్లు అలవాటుచెయ్యాలి.

భ: కాని అది స్థిరంగా ఉండదే.

మః 'శనైశ్చనై రుపరమేత్' అని భగవద్గీత. (మనస్సును క్రమక్రమంగా స్థిరం చేయవలె). 'ఆత్మసంస్థం మనఃకృత్వా' (మనస్సు నాత్మలో నెలకొల్పి); 'అభ్యాస వైరాగ్యాభ్యామ్' (అభ్యాసము వైరాగ్యముల ద్వారా) అభ్యాసం అవసరం. ఆధ్యాత్మిక పురోగతి నెమ్మదిగా జరుగుతుంది.

‡ ఆత్మసంస్థమ్లో పేర్కొన్న ఆత్మయెట్టిది?

ము నీ ఆత్మను నీవెరుగవా? నీవున్నది నిజం. దాన్ని కాదనలేవు. ఈ ఆత్మయెవరు అన్నప్రశ్న నీవు లేకుంటేనే వస్తుంది. నువ్వు లేకపోతే నువ్వు ప్రశ్నను వేయలేవు. అంటే ప్రశ్నించేవెళ నీవుండే తీరవలె. నీ ప్రశ్నయే నీ ఉనికిని తెల్పుతుంది. నీవెవరవో కనుక్కో అంతే.

భ: నేనెన్నో గ్రంథాలు చదివాను. కాని మనస్సు ఆత్మవైపు మళ్ళటం లేదు

. మ: ఆత్మ పుస్తకాల్లో లేదు గనుక. అది యున్నది నీలో. పుస్తకాలు పాండిత్యాన్నిస్తాయి. వాని ప్రయోజనము, ఫలితము అదే.

భ: ఆత్మసాక్షాత్కారమంటే ఏమిటి?

మ: నీవు ఆత్మవు. ఆ సాక్షాత్తు (ఇక్కడ -ఇప్పుడు) కూడా నీవే. దానిలోని 'కార' సాధించటానికి తావేదీ? నీవనాత్మవనుకుంటేనే ఆ ప్రశ్న లేదా నీకు ఆత్మలు రెండా, ఒకటి రెండోదాన్ని కనుగొనేదానికి? అట్లనుకోవడం అవివేకం.

నీ దేహాత్మబుద్ధియే నీయీ ప్రశ్నకు మూలం. ఈ ప్రశ్న తోచింది ఇప్పుడు. ఇదే నీవు నిద్రిస్తూండగా కలిగిందా? అప్పుడు నీవు లేవా? అప్పుడు లేక ఇప్పుడు ఈ ప్రశ్న రావటానికి, ఈ రెండవస్థల్లో గల భేదమేమి? దేహం నీవని ఇప్పుడనుకున్నావు. నీచుట్టూ ఎన్నో వస్తువులు చూస్తున్నావు; ఆత్మా అలాగే కనబడవలెననుకుంటావు. అలవాటు బలం అట్టిది. ఏ విషయంగాని తెలుసుకోవడానికి ఇంద్రియాలుపకరణాలు మాత్రమే. ద్రష్టవు నీవు ద్రష్టగానే ఉండు. చూడటానికి వేరేముంది? నిద్రలోని స్థితి అట్టిది. అందువల్లే ఈ ప్రశ్న అప్పుడు రాలేదు.

ఈ రీతిగా ఆత్మసాక్షాత్కారము కేవలం అనాత్మనిరసన మాత్రమే. త్యాగం మాత్రమే.

భ: ఆత్మ ఒక్కటేనా, ఎన్నో ఉన్నాయా?

మ: ఈ ప్రశ్న కూడా నీకు స్పష్టత లేక పోవడం వలన వచ్చేదే. నీవు దేహాన్ని ఆత్మగా భావిస్తావు. నీవనుకొంటావు. 'నేనిక్కడ ఉన్నాను, ఇచ్చటే వాడూ వున్నాడు, ఇంకొకడు అక్కడ ఉన్నాడు మొదలైనవి. ఇట్లు చాల దేహాలు చూచి, ఆత్మలూ చాల ఉన్నవంటావు. నిద్రలో నీవేమైనా 'నేనిక్కడ నిద్రిస్తున్నాను; నిద్రపోకుండా మరెందరున్నారో?' అంటావా? ఇదే కాదు మరే ప్రశ్నయినా వస్తుందా? ఎందుకు రాదు? నీవొక్కడవే గనుక, మరెవ్వరూ లేరు గనుక.

భ: నా తత్త్వం (సత్యం) ఏమి?

మ: నీకు నీవే తత్త్వం. ఇంకొకరుంటేగద వాని తత్త్వం కనుగోవడం. తత్త్వానికి వేరుగా అసలు నీవు ఎలా ఉండగలవు? నీవుండబట్టే ఈ ప్రశ్నలు వస్తున్నవి. నీ ఉనికియే తత్త్వము, తత్త్వపు వేషాలకుపోక, నీ సహజ ప్రకృతిలో నిలబడు. శ్రుతులన్నీ మిథ్యకై - తత్త్వంకాని దానికై - వ్యర్థయత్నాలు మానమంటాయి. తత్త్వంకాని దాన్ని వదలివేయి. ఆ పైన తత్త్వము సంతతం ఏకమూ శుద్ధమూనై మిగిలి వెలుగుతుంది.

భ: నేను నా తత్త్వాన్ని, విధులనూ తెలుసుకోవాలనుకుంటున్నాను.

మ: మొదట నీ తత్త్వం తెలుసుకో; విధుల విషయం ఆ తర్వాత అడగవచ్చు. విధులను తెలియుటకు, నెరవేర్చుటకు నీవు వుండి తీరాలి. నీ ఉనికినెరిగి, అటుపైన విధులగురించి విచారణ చెయ్యి.

## భాషణములు 566

'ఆర్యధర్మం' అని ఒక తమిళపత్రిక. దానిలో వైరాగ్యంపై ఒక వ్యాసముంది. ఒకరడిగిన ప్రశ్నకు బదులుగా శ్రీభగవాన్ దానిని చదివి వినిపించారు. దాని సంగ్రహమిది.

వైరాగ్య = వి + రాగ = విగతరాగ (అనాసక్తి లేదా సంగరహితము) వివేకులకే వైరాగ్యము సాధ్యం. జనసామాన్యం దాన్ని సరియైన అర్థంలో వాడరు. ఉదాహరణకు - తాను సినిమాలకు పోరాదని నిశ్చయించాడు. వాని కది వైరాగ్యము. ఇట్లు పదాల, నానుడుల అపప్రయోగం తరచు కానవస్తుంది. మనం సాధారణంగా వినేదే - కుక్క ఉంది రాయి లేదు, రాయి ఉంది, కుక్క లేదు' అని. కుక్కపై విసరటానికి రాయి సమయానికి దొరకలేదని దాని సామాన్యార్థము. కాని ఆ నానుడికి వేరే లోతైన అర్థముంది. దానికొక కథ - ఒక ధనికుని ఇల్లు, కాపలా కట్టుదిట్టంగా ఉంది. ద్వారస్తంభానికి గొలుసుతోకట్టి ఒక క్రూరజాగిలము. నిజానికి ఆ కుక్కా ఆ గొలుసూ అత్యంత నిపుణ శిల్పాలు. వానిలో జీవకళ అంతగా ఉట్టిపడేట్టు రాతిలో చెక్కారు. దారినపోతూ ఒకదా ఉగ్రశునకాన్ని చూచి భయపడి తప్పించుకోబోయి గాయపడ్డాడు. వానిపై జాలిచెంది తెలిసినవాడొకడు అది నిజమైన కుక్కకాదనీ, శిల్పమేననీ వానికి తెలియచేసాడు. మరొకమారటుగా పోతున్నప్పుడు వాడే ఆ శిల్పనైపుణ్యాన్నెంతో మెచ్చుకున్నాడు. పూర్వపు తన భయం మరచిపోయాడు. అంటే అది కుక్క అనుకొన్నంత కాలం దాన్ని మలచిన రాతిని చూడలేదు; అది శిల్పమని తెలిసాక తన్ను భయపెట్టిన క్రూర శునకం కనుపించలేదు. ఈ సామెత అందుకు. ఇలాంటిదే మరొకటున్నది - "గజం కలపను కప్పుతుంది; కలప గజాన్ని కప్పుతుంది" ఇక్కడ ఆ గజం కొయ్యయేనుగు.

ఆత్మ ఎప్పుడూ సత్ -చిత్ - ఆనందము. మొదటి రెండూ మూడవస్థల్లోనూ అనుభవంగా ఉంటాయి. మూడవది నిద్రావస్థలోనే అనుభూతమవుతుంది. జాగ్రత్ స్వప్నాల్లో ఆత్మయొక్క స్వస్వభావం నష్టమెట్లయిందని ప్రశ్న. నిజంగా అది నష్టం కాలేదు. నిద్రలో మనస్సు లేదు. ఆత్మ తానుగా ప్రకాశిస్తుంది. మిగత రెంటిలో వెలిగేది ఆత్మయొక్క ప్రతిబింబిత కాంతియే. నిద్రలో తలపులన్నీ అణగిన పిదపనే ఆనందానుభవం. ఇతరదశల్లో అది ప్రియ, మోద, ప్రమోదాలుగ వ్యక్తమౌతుంది. కాని అవన్నీ చిత్తవృత్తులే. (మనస్సు యొక్క స్థితులు)

వీధిలో నడచేవాని మనస్సునిండా నిలుకడలేని ఎన్నో ఆలోచనలు వస్తాయి. మాటవరసకు వాడు బజారువెంట వెడుతున్నాడందాము. మంచి మామిడి పండ్లు కనబడతాయి. అవి వానికిష్టమై వానిని కొన్నాడు. త్వరత్వరగా ఇంటికివెళ్ళి పండ్లుతిని ఎంతో తృప్తిపడుతాడు. పరుగిడుతున్న ఆలోచనలు పండ్లను చూస్తున్నప్పటి సంతోషం, 'ప్రియం'; వానిని కొని తన స్వంతం చేసుకొన్నప్పటి సంతోషం. 'మోదం'; తిన్నప్పటి సంతోషం 'ప్రమోదం'. ఈ త్రివిధ సంతోషాలకూ ఇతర ఆలోచనలు మాయమవడమే కారణం.

# భాషణములు 567

'సద్విద్య'లో తొలిపద్యాల కొన్నిటిని శ్రీభగవాన్ మెకైవర్కు వివరించారు.

1. మొదటి పద్యం మంగళారంభం. గ్రంథంలోని విషయం ఇందులో ప్రస్తావించుటైనది. జ్ఞానము, ఉనికికి భిన్నమా? ఉనికి మూలము. అది హృదయము. అట్టి పరమాత్మను నుతించుట మరియు ధ్యానించుట ఎలా?

ఆత్మగా ఉండటమే. అదే సర్వశుభాలకు ఆరంభం. ఇది జ్ఞానమార్గానుసారంగా నిర్గుణబ్రహ్మమును తెలుపుతున్నది.

2. రెండవపద్యంలో సగుణబ్రహ్మస్తుతి. మొదటిదానిలో ఆత్మనిష్ఠ చెప్పారు. దీనిలో శరణాగతి తెలిపారు. ఇంతేకాకుండా 1. అధికారి 2. విషయము 3. సంబంధము 4. ప్రయోజనం చెప్పబడ్డాయి. అధికారి అంటే గ్రహణయోగ్యత కలవాడు. అర్హతలు: ప్రపంచమంటే విరాగము, ముముక్షత్వము (మోక్షముయందు కోరిక కలవాడు.)

ఎప్పుడో ఒకప్పుడు తాము చనిపోవలసియుందని అందరికీ తెలుసు. కాని ఆ విషయం లోతుగా ఆలోచించరు. మృత్యువంటే అందరికీ భయమే. కాని ఆ భయం క్షణికం. మృత్యుభీతి ఎందుకు? దేహాత్మబుద్ధివల్ల. దేహం చనిపోతుందని దానికి దహనాదులౌతాయని అందరికీ బాగా తెలుసు. చనిపోతే దేహం నష్టమవటం ప్రసిద్ధమే. దేహాత్మబుద్ధివల్ల, దేహం చనిపోతే తానే పోతానని ఈ భయం. పుట్టుకచావు, శరీరానికి మాత్రమే. కాని వానిని ఆత్మపై ఆరోపించడం వలన పుట్టుకచావులాత్మకని భ్రమ కలుగుతుంది.

జనన మరణాలనుండి తరించడానికి మానవుడు పరమాత్మను ప్రార్థిస్తాడు. దైవమన్న భక్తి శ్రద్ధలు పుట్టినవీవిధంగా. ఆ దైవాన్ని ఆరాధించేదెలాగ? ప్రాణి నిస్సహాయకుడు; భగవంతుడు సర్వశక్తి మంతుడు. ఆయనను సమీపించెదెట్లా? తన బాగోగులను ఆయనకే వదలటం కన్న గత్యంతరం లేదు. పూర్ణశరణాగతి యొక్కటే మార్గం. కాబట్టి దైవానికి తనను అర్పించుకుంటాడు. అర్పణమంటే వ్యక్తి తననూ తన సర్వస్వాన్ని ఆకరుణాళువు కర్పించటం. ఇక మానవునికి మిగిలిందేమి? ఏమీ లేదు - తానూ లేడు, తనవీలేవు. పుట్టుచావుల కల్గిన దేహం ప్రభునకర్పితమే గనుక, దానిని గూర్చి తన విచారమూ ఇంక అక్కరలేదు. ఇక పుట్టుచావులు తన్ను భయపెట్టలేవు. భయకారణం దేహం. అది ఇక తనది కాదు. మరి తనకు భయమెందుకు? భయపడటానికి వ్యక్తియొక్క గుర్తింపు ఎక్కడ?

ఆత్మ ఈ విధంగా సిద్ధిస్తుంది. దాని ఫలమానందం. గ్రంథ విషయము ఇది; దుఃఖనివృత్తి, సుఖప్రాప్తి పొందదగిన పరమశ్రేయస్ ఇదే. శరణాగతీ, కేవలానందము పర్యాయపదాలు. ఇదే సంబంధము.

ఫలం, గ్రంథ విషయ చింతనవల్ల నిత్యమూ, సర్వత్రాస్థితమైన జ్ఞానాన్ని పొందటం. పద్యం "అమృతత్త్వము పొందినవాడు"తో పూర్తి అవుతుంది.

3. పంచేంద్రియాలంటే వాని సూక్ష్మ క్రియలు (తన్మాత్రలు), వినుట, చూచుట, తాకుట, రుచిచూచుట, ఆఘ్రాణించుట, పలువిధాలైన వీని కలయికలే ఈ ప్రపంచము. గుణాలవల్ల అవి ఇట్లు మారుతాయి.

తమస్సు (మందము, బద్ధకము చే స్థూలభూతములు

రజస్సు (క్రియాశీలత)చే విషయాలను తెలిసికోడానికి కావలసిన పరికరాలు (కరణాలు)

సత్త్వముచే (స్పష్టత) ... ఇంద్రియ విషయ జ్ఞానములు మరియు;

తమస్సుచే .... స్థూల విషయాలు, అంటే ప్రపంచం.

రజస్సుచే ... ప్రాణములు మరియు కర్మేంద్రియాలు

సత్వముచే ... జ్ఞానేంద్రియాలు

కర్మేంద్రియాలుచే వాక్, పాణి పాద పాయూపస్థలు (మాట్లాడుట, పట్టుకొనుట, నడుచుట, విసర్జనము, సంతానోత్పత్తి)

గంట మ్రోగిందనుకో. శబ్దము వినుటకు చెందినది. గంట విషయము తమోగుణములతో కూడినవి. రాజసిక తన్మాత్రలు, శబ్దస్పందనాదులుగా మారుతూ గంటచుట్టూ పర్వి, ఆకాశంవలన చెవిచేరి, శబ్దంగా వ్యక్తమౌతుంది. దాన్ని శబ్దంగా గుర్తించే ఎరుక, సత్వతన్మాత్ర.

అట్లే ఇతర ఇంద్రియజ్ఞానాలు

స్పర్శ = వాయుతన్మాత్ర, రూప = తేజతన్మాత్ర, రస = అప్ (జల) తన్మాత్ర, గంధ = పృథ్వీతన్మాత్ర.

తన్మాత్రలను సూక్ష్మాతిసూక్ష్మకణాలుగా ఎన్నడం సరికాదు. అది పూర్తిజ్ఞానం కాదు. అవి కేవలం శబ్ద స్పర్శరూపరసగంధాల సూక్ష్మ రూపాలు. అవి సకల విశ్వాన్ని కూర్చిన భాగాలు. ప్రపంచ సృష్టి అలాంటిది.

పారిభాషిక పదాలు లేనందున ఈ భావాలను విదేశభాషల్లో సరిగా వివరించటం సాధ్యం కాదు.

4. ఈ పద్యంలో అందరూ అంగీకరించే విషయం ఒకటుంది. అది ద్వైతానికి అద్వైతానికి గూడ అవ్వలిస్థితి. కర్తృకర్మలదాటి జీవేశ్వరుల కతీతంగా అన్నిభేదాల నధిగమించినట్టిది. అది అహంకార రహితము. దానికి చేరుకొనేదెలాగ? ప్రపంచాన్ని త్యజించటంమూలాన, అంటుంది పద్యం. ఇక్కడ ప్రపంచం అంటే దాన్నిగూర్చిన ఆలోచనలని అర్థం. అట్టి ఆలోచనలు పొడసూపకపోతే అహంకారం తలయెత్తదు. అప్పుడు కర్తలేడు, విషయమూ లేదు. ఆ స్థితి అట్టిది.

## భాషణములు 568

శ్రీ వి.జి. శాస్త్రి ఒక పత్రికాఖండం చూపారు. తన పూర్వోన్నత్యాన్ని భారతదేశం పూర్ణంగా క్రీ.శ. 1950కి ముందు పొందునని శ్రీరామతీర్థస్వామి చెప్పినట్లుందున్నది. శ్రీ భగవానన్నారు: ఇండియా ఉన్నతస్థితిలో అంతకు ముందే లేదని ఎందుకు అనుకోవాలి. ఆ వైభవమున్నది నీ ఆలోచనల్లో.

## భాషణములు 569

శ్రీ. కె.ఎల్. శర్మ ప్రశ్నకు బదులుగా శ్రీభగవాన్ దక్షిణామూర్తి స్తోత్ర విషయం ప్రసంగించారు

పూర్వమాస్తోత్రానికొక వ్యాఖ్యవ్రాద్దామనుకొన్నాను. శ్రీరంగనాథయ్యర్ నా తమిళ ప్రతిని తీసుకొనివెళ్ళి, అప్పడపుపాటతో చేర్చి ముద్రించాడు. ఆ పిమ్మట దాని వివరణం వ్రాయమని అడిగాడు. ఉపోద్ఘాతం తయారయింది. అతడది చూచి ముద్రణకై తీసుకొని వెళ్ళాడు. ఆ తరువాత అది సాగలేదు. ఇక స్తోత్ర విషయం -

సృష్టికర్తయైన బ్రహ్మకు నల్గురు మానసపుత్రులు. సనక, సనందన, సనత్కుమార,

సనత్సుజాతులని వారి పేర్లు. మమ్మల్ని ఎందుకు పుట్టించావని వారడిగితే బ్రహ్మ అన్నాడు - 'నేను విశ్వాన్ని సృజించవలసియుంది. కాని ఆత్మసిద్ధికై నేను తపమొనరించేందుకై పోతున్నాను. ఆ విశ్వసృజన మీ కప్పచెప్పుతామని మిమ్ము జనింపచేసాను. మిమ్ము మీరు గుణీకరిస్తూపోతే అది జరుగుతుంది' వారెవ్వరికిది నచ్చలేదు. తమకెందుకీ వృధాయాసం? ప్రతివానికీ తన మూలాన్ని కోరుకోవడం సహజం. వారు తిరిగి తమ మూలాన్ని చేరుకొని ఆనందంగా

ఉందామని నిశ్చయించారు. అట్లే వారు బ్రహ్మ మాటను మన్నింపక ఆయన్ను వదలి వెళ్ళిపోయారు. ఆత్మసాక్షాత్కారానికై వారు మార్గదర్శిత్వం కోరుకొన్నారు. ఆత్మసిద్ధికి వారు నల్వురూ అర్హులే. అట్టివారికి దారిజూపే సద్గురువు అసామాన్యుడుగనే ఉండాలి. అట్టివాడు యోగిరాజగు శివుడుగాక మరెవ్వరు? పవిత్రమైన వటవృక్షం నీడలో గూర్చుండి శివుడు వారికి ప్రత్యక్షమైనాడు. అతడే యోగేశ్వరుడు, ఆయనకును యోగాభ్యాసమేమి? కూర్చున్నవాడు కూర్చున్నట్లే ఆయన సమాధిగతుడైనాడు. ఆయన నిశ్చలశాంతి పూర్ణుడు. ఎల్లెడలా మౌనం నెలకొన్నది. వారాయన్ను చూచిన క్షణమే ప్రభావితులైనారు. సద్యఃఫలంగా వారూ సమాధి నిష్ఠులయ్యారు. వారి సంశయాలన్నీ మటుమాయమయ్యాయి.

మౌనమే నిజమైన ఉపదేశం. అదే అత్యుత్తమమైన ఉపదేశం. పూర్ణపరిణతునికే అది తగినది. ఇతరులు దానివల్ల పూర్ణప్రబోధం పొందలేరు. అట్టివారికి సత్య వివరణ కావాలి. అందుకై మాటలు కావాలి. కాని సత్యం వాగాతీతము. దానికి వివరణ అసాధ్యం. సాధ్యమైనది దాన్ని సూచించుట మాత్రమే. అది ఎలా చెయ్యగలము?

జనులు భ్రాంతిలో ఉన్నారు. దానిపట్టు సడలిస్తే వారు సత్యాన్ని గుర్తిస్తారు. భ్రాంతి ఎలా నిజం కాదో తెలిసికొమ్మని తెలియచెప్పాలి. అప్పుడే వారు ఆ మాయాజాలం నుండి తప్పించుకో ప్రయత్నిస్తారు. వైరాగ్యం ఆ విధంగా కలుగుతుంది. వారు సత్యానికై వెదకుతారు. అంటే ఆత్మవిచారం చేస్తారు. అది వారి నాత్మస్థితులను చేస్తుంది. శివావతారమైన శ్రీ శంకరాచార్యులవారికి పతితజనులపై ఎంతో కరుణ. వారి కందరికీ స్వస్వరూపానందం తెలుపవలెనని వారి కోరిక. మౌనంతో వారినందరినీ ప్రబోధింప వీలుగాక ఆయన దక్షిణామూర్తి స్తోత్రం రచించారు. వారందరూ దానిని చదివి సత్యాన్ని అర్థం చేసుకోవచ్చునని.

భ్రాంతి స్వభావమేమి? అందరూ భోగవశులై ఉన్నారు. (భోక్త, భోగ్యము, భోగము) భోగ్యవస్తువులు యథార్థములన్న తప్పు భావన దీనికి కారణం. అహంకారము. ప్రపంచము, సృష్టికర్త ఇవి మాయకు ఆధారాలు. అవి ఆత్మకు భిన్నంగా లేవని తెలిస్తే మాయావరణం తొలగిపోతుంది.

మొదటి నాలుగు శ్లోకాలు ప్రపంచాన్ని ప్రస్తావిస్తాయి. ఆ ప్రపంచం గురునికి వేరుగాదు. ఆయన ఆత్మయే శిష్యుని ఆత్మయనియు లేక సాధకుడు తనను సమర్పించవలసింది గురువనియు తెలుపబడినది. తరువాతి నాలుగు శ్లోకాలు జీవుని గూర్చినవి, జీవుని యాత్మ గురుని యాత్మ కభిన్నమని తెలిపేవి. తొమ్మిదవ శ్లోకంలో ఈశ్వరునీ, పదోశ్లోకంలో సిద్ధినీ వివరించారు.

ఇది దక్షిణామూర్తి స్తోత్ర ప్రణాళిక.

"విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం" అన్నారే, ఇందులో దర్పణమేది? మన మెరిగిన అద్దం జడము, దానిపై పడిన కాంతిని ప్రతిఫలింపచేస్తుంది. జీవిలోని అద్దమేమి? స్వయంభాసియైన ఆత్మప్రకాశం, మహతత్త్వం పైన ప్రతిఫలిస్తుంది. ఆ ప్రతిబింబిత కాంతి మానసాకాశం లేక శుద్ధమానసం. జీవి వాసనలను భాసింపచేసేది ఇదే. అందుండే 'నేను' 'ఇది'యన్న భావనలు ఉద్భవిస్తాయి. ఈ శ్లోకాలు మొదట చదివినప్పుడు అందు చెప్పిన బంధమోక్షాదులన్నీ సద్గురువు దక్షిణామూర్తికి సంబంధించినవని పైపై అర్థము స్ఫురిస్తుంది. అది తప్పు. నిజానికది సద్గురువుకు శిష్యుని శరణాగతి నుద్దేశించినవి.

## భాషణములు 570

భక్తుడు: 'నిర్గుణోపాసన కష్టమనీ, ఆపత్కరమనీ అంటారు. శ్రీ భగవద్గీతలో 'అవ్యక్తాహి...'యని చెప్పినట్లు.

మహర్షి: వ్యక్తమైనదాన్ని అవ్యక్తముగా భావించి అనవసరంగా సంశయాన్ని కల్పించారు. ఆత్మకన్న సన్నిహితమూ, సిద్ధమూ వేరున్నదా? ఇంతకంటే స్పష్టమేమి?

భక్తుడు: సగుణోపాసన సులువుగా కనిపిస్తుంది.

మహర్షి: నీకు సులువేదో అది చేయి.

## భాషణములు 571

జీవుల నానాత్వాన్ని చాలమంది వితర్కిస్తారు. జీవుడంటే అహంకారంపై గల ప్రతిబింబిత కాంతి. వ్యక్తి అహంకారంతో తాదాత్మ్యం చెంది, తనవలెనే పలువురున్నారని వాదిస్తాడు. ఆ వాదంలోని అవ్యవస్థను గమనించడు. కలలో సెంత మందినో చూచిన వ్యక్తి, మేల్కొని, వారందరూ నిజమని నమ్మి కుశల మడుగుతాడా?

ఈ వాదం పూర్వపక్షులకు (వాదించేవారికి) నచ్చదు.

చంద్రుడున్నాడు. అతని సెచటినుండి చూచినా, ఎప్పుడు చూచినా చంద్రుడు చంద్రుడే. అది ప్రతివానికీ తెలిసిందే. నీళ్ళ కడవలు చాల ఉన్నవి. వానిలో చంద్రుడు ప్రతిబింబిస్తాడు. అవి తమలో తమకూ, తాము చంద్రునికీ భిన్నరీతులలో ఉంటాయి. ఆ కడవలలో ఒకటి పగిలిపోతే, దానితో పాటు ఆ చంద్రుడూ కనబడడు. అతడు మాయమైనంత మాత్రాన ఇతర కడవలలోని చంద్రులకూ, అసలు చంద్రునికీ సేవిధమైన ప్రభావమూ పడదు. వ్యక్తియొక్క ముక్తి విషయంలోనూ అంతే. ఆ ఒక్కడే ముక్తుడౌతాడు.

నానాత్మవాది అద్వైతానికి ప్రతిగా పై వాదాన్ని గ్రహిస్తాడు. "ఆత్మ ఒక్కటే అయితే, ఏ వ్యక్తి ముక్తుడైనా అందరూ ముక్తులే. కాని అనుభవమదిగాదు. అందువల్ల అద్వైతము సరికాదు."

పై వాదంలో పెద్ద బలహీనత ఏమంటే, అహంకారం ప్రతిబింబించే కాంతి, ఆత్మప్రకాశమని భ్రమపడుతుంది. అహంకారం, జగత్తు, జీవుడు - ఇన్నిటికీ వ్యక్తి వాసనలే కారణం. వాసనానాశం అయితే వ్యక్తిగత భ్రమ అదృశ్యమై (పగిలిన కుండలోని బింబంవలె), తత్సంబంధిత ప్రతిబింబిత కాంతి మాత్రం అంతమౌతుంది.

నిజానికి ఆత్మ ఎప్పుడూ బందీ కాదు. కాబట్టి దానికి విమోచనమూ లేదు. అన్ని బాధలూ అహంకారానికి మాత్రమే.

భక్తుడు: జీవుల నానాత్మప్రసక్తి తప్పేట్లౌతుందనేది ప్రశ్న. తప్పకుండా జీవులు అనేకులు. జీవుడు, అంటే అహంకారము. అది ఆత్మయొక్క ప్రతిబింబిత కాంతి. ఆత్మ పెక్కులనుట తప్పుకాని, జీవులనేకులన్నది తప్పుకాదు.

మహర్షి: జగత్తును చూస్తాడు గనుక వానిని జీవుడన్నారు. కలగన్నవాడు, కలలో జీవులెందరినో చూస్తాడు; వారందరూ నిజం కాదు. కలగన్న వాడొక్కడే ఉన్నాడు. వాడే అందరినీ చూచేది. ఆ విధంగానే వ్యక్తి జగత్తులు. ఆత్మ ఒక్కటే అనే సిద్ధాంతం ఉంది. దానినే ఒకే జీవుడు ఉన్నాడనే సిద్ధాంతం కూడా అంటారు. దాని ప్రకారం జీవుడొక్కడే. వాడే ఈ ప్రపంచాన్ని, దానిలోని జీవులందరినీ చూసేవాడు.

భక్తుడు: అట్లయితే, ఇక్కడ జీవుడంటే ఆత్మయే.

మహర్షి: అవును. కాని ఆత్మ దేనినీ చూడదు. పైన చెప్పిన మతంలో అతడు ప్రపంచాన్ని చూస్తున్నాడు అని చెప్పబడింది. కాబట్టే వానిని జీవుడని భిన్నంగా చెప్పడం జరిగింది.

## భాషణములు 572

భక్తుడు: మృత్యువు అందరికీ సామాన్యమే. అటువంటప్పుడు మృత్యువంటే భయపడి ఏమి ప్రయోజనం?

మహర్షి: నిజమే. అది అందరికీ సమానమే. ఆ భయానికి ప్రయోజనమూ లేదు. మనస్సులోని వాసనల ప్రాబల్యంవల్ల మానవుడు సహజంగానే చనిపోతాడు. ఆ భయంవల్ల వైరాగ్యం కలుగదు; అతడు దాని గురించి వివేచనము చెయ్యలేడు.

భక్తుడు: కాని మిమ్ము చూడవచ్చిన వారికందరికి, తరతమాలు లేక, ఒకే ఉపదేశం ఇస్తున్నారే?

మహర్షి: నేను చెప్పేదేమి? ప్రతివానిలోని అహంకారము చావాల్సిందే. దానిపై వానిని విచారించనీ. అహంకారం ఉందంటావా, లేదంటావా? దానినే మననం చేస్తుంటే అధికాధికంగా వాడర్హత సాధిస్తాడు.

## భాషణములు 573

రంగనాథయ్యర్ పదునాల్గేండ్లుగా శ్రీ రమణభక్తుడు. ఆయన వచ్చియున్నారు. ఆయన శ్రీభగవాన్ ను అడిగారు -

మృతికీ మళ్ళీ పుట్టుకకూ మధ్య వ్యవధి ఎంత?

మహర్షి: ఎక్కువా ఉండవచ్చు. తక్కువా ఉండవచ్చు. కాని జ్ఞాని కట్టి మార్పులేవీ ఉండవు. అతడు విశ్వాత్మలో లీనమగునని బృహదారణ్యకోపనిషత్ వచిస్తుంది. చనిపోయిన తర్వాత శుక్ల మార్గంలో పయనించేవారు మరి జన్మించరు; కృష్ణ మార్గంలో వెళ్ళేవారు సూక్ష్మతనువులతో, కర్మఫల భోగాలనుభవించిన తర్వాత పునః జన్మిస్తారని ఒక మతం.

ఒకని పుణ్యపాపములు సమపాళ్ళైతే వాడు సూటిగా మరల భూమిపై జన్మిస్తాడు. పుణ్యం పాలు హెచ్చైతే, సూక్ష్మ శరీరం స్వర్గలోకానికి పోయి, ఆ పిమ్మట భూమిపై పుడుతుంది. పాపం పాలు ఎక్కువైతే, నరక లోకాలకుపోయి తర్వాత భూమిపై పుట్టడం జరుగుతుంది.

యోగభ్రష్టుని గతికూడ ఇలాగే. ఇవన్నీ శాస్త్రాల్లో చెప్పబడ్డాయి. కాని నిజంగా పుట్టుచావులు లేవు. ఎవని నిజ స్వరూపం ఎలాగో వాడు అలాగే ఉంటాడు. ఏకైక సత్యమిదే. నిజంగా వ్యక్తి తన స్వభావంలోనే ఉంటాడు.

## భాషణములు 574

భక్తుడు: ఆసనాలు ఏవి? అవి అవసరమా?

మహర్షి: యోగశాస్త్రాల్లో చాలా రకాల ఆసనాలు, వాని ప్రయోజనాలతో సహా, చర్చించి ఉన్నారు - ఆస్తరణం పులితోలు, దర్భలు, మొదలైనవి; ఆసనం తీరుతెన్నులు -"పద్మాసనము, సుఖాసనములాంటివి. ఇవన్నీ ఎందుకు? కేవలం తన్నుతాను తెలిసికోడానికి. "నేను దేహం. దేహానికి కూర్చోటానికి పీఠం కావాలి. ఇది నేల అంటూ" తగిన ఆసనాలతో వెదకుతాడు. కాని నిద్రలో ఆధారంగా, మంచం మీదనా, నేలపైననా, అని యోచిస్తున్నాడా? నిద్రలోగూడ తాను లేడా? అప్పుడెలా ఉన్నాడు?

నిజం ఇది. తాను ఆత్మ. అహంకారం పుడుతుంది. అది తాను దేహమని భ్రాంతి కల్గిస్తుంది. జగత్తు నిజమని పొరబడడం, విషయములు వివిధాలుగా అనేకములుగా భావించడం, తన్ను అహంకార రూప అజ్ఞానం కప్పుతుంది. అవిచారితంగా ఆలోచించి అతడు ఆసనాలకై వెదుకుతాడు. అన్నిటికి కేంద్రం తానేనని, ఆధారమే తాననీ అర్థం చేసుకోడు.

ప్రశ్నిస్తే వివిధాలైన ఆసనాలు, వివిధాలైన పాదరక్షలకు గల ఫలితములను ఐస్కాంత, భూమ్యాకర్షణా పరిభాషలో చెప్తాడు. అవి లేక తన తపస్సు యొక్క ప్రభావము తగ్గిపోతుందని ఊహిస్తాడు.

వీటికన్నిటికీ శక్తి ఎక్కడినుండి వస్తుంది? ఫలితాలు చూచి, వాని కారణాలు వెదకి, అవి ఆసనాలు, పాదరక్షల ప్రభావజనితాలని అనుకుంటాడు. రాతిని పైకి విసరితే అది తిరిగి క్రిందికే వస్తుంది. ఎందుకు? భూమ్యాకర్షణంవల్ల అనిఅంటాడు. ఇట్లే ఏవేవో సరి. అవన్నీ వాని ఆలోచనలకు వేరైనవా? నేల, రాయి, ఆకర్షణశక్తి, ఇవన్నీ వాని ఆలోచనముల కన్యాలేమో ఆలోచించి చెప్పు. అన్నీ వాని మనస్సులోనివే. అతడే శక్తి, అతడే దాని నిర్వాహకుడు కూడా. అన్నిటికీ ప్రాపు, కేంద్రం ఆతడే. అతడే ఆసనం గూడ.

సుస్థిరంగా కూచోడానికి వాని ఆసనం. నిజస్థితిలోగాక మరెక్కడ, ఏవిధంగా నిశ్చలంగా నుండగలడు? అదే వాని ఆసనం.

## భాషణములు 575

భక్తుడు: కామక్రోధాదులను జయించేదెట్లు?

మహర్షి: కామము, క్రోధము, ఇత్యాదులు నొప్పించేవి. కారణం? అహంకారం. అహంకారం అజ్ఞానంవల్ల కలుగుతుంది; అజ్ఞానం నానాత్వ భావనవల్ల; నానాత్వం జగత్తు సత్యమనే భ్రాంతివల్ల, అది "నేనుదేహము" అనే బుద్ధి వలన కల్గుతుంది. ఈ దేహాత్మబుద్ధి మనస్సు పుట్టేకనే కలుగుతుంది. అహంకారం పుట్టకపోతే, పై అనర్థం పరంపర అంతా అదృశ్యమౌతుంది. అందుచేత అహంకారం జనించడాన్నే ఆపివేయి. నీ నిజస్థితిలో నిలిస్తే, ఇది సాధ్యం. అప్పుడు కామక్రోధాదులను జయించవచ్చు.

భక్తుడు: అయితే వీనికన్నిటికి మూలం అజ్ఞానమేనా?

మహర్షి: అవును. అదే, అజ్ఞానం వల్ల భ్రాంతి, దానివల్ల మోహం. అదే వరస. అజ్ఞానమంటే ఏమి? కేవలజ్ఞానమనీ, ఆత్మయనీ అంటామే, ఆ శుద్ధ బ్రహ్మమేనా? ప్రశ్నించేవాడు తన్నుతాను తెలిసికోనీ, జ్ఞానిస్థితినందనీ. అప్పుడీ ప్రశ్నలు రావు. అజ్ఞానంవల్లనే ఈ ప్రశ్నలు. ఆ అజ్ఞానం ప్రశ్నించేవానిదేగాని ఆత్మదిగాదు. సూర్యుదుదయిస్తే, చీకటి నిలువదు.

ఇనుప బీరువాలో నిధి దాచబడింది. వ్యక్తి అది తనదంటాడు; బీరువా అనదు. ఈ ప్రతిపాదనకు మూలం స్వీయమన్న భ్రాంతి. ఆత్మకు స్వతంత్రించి వేరేదీలేదు, అజ్ఞానంతో సహా. ఎందుకంటే అజ్ఞానం.

ఆత్మయొక్క శక్తి. అజ్ఞానం అక్కడే ఉంటుంది. కాని ఆత్మను ఏ విధంగానూ ప్రభావితం చెయ్యలేదు. అజ్ఞానం అహంకారాన్ని అంటే జీవుని బాధిస్తుంది. కాబట్టి అజ్ఞానం జీవునిది.

ఎలా? అతడు తన్ను తాను తెలియదంటాడు. ఒకటి కర్తగాను, మరియొకటి కర్మగాను రెండు ఆత్మలున్నవా? ఉన్నవని యొప్పుకోలేడు. అంతమాత్రాన వానికి అజ్ఞానం పోయినట్లేనా? పోలేదు. అహంకారం ప్రారంభమే అజ్ఞానము. వేరే మరేమీ లేదు.

## భాషణములు 576

సూత్ర భాష్యము: శ్రుతి వచనాలను వివరించి ప్రతిష్ఠించడానికై సూత్రాలు. భాష్యాల ఉద్దేశ్యమూ అదే. కాని అది వేరే వాదాలను తెలియజేసేవి. వానిని పూర్వపక్షం చేసి (వాటిని ఓడించి) దీర్ఘంగా తర్కించినమీదట, సిద్ధాంతాలను ప్రకటం చేస్తాయి. ఒకే సిద్ధాంతానికి చెందినవారిలోనూ భేదాభిప్రాయాలు లేకపోలేదు; వారిలో మళ్ళీ పూర్వపక్షం, సిద్ధాంతము. భిన్నసిద్ధాంతాలవారు ఒకే శ్రుతి వాక్యాన్ని వేర్వేరుగా వివరించి, పరస్పర విరుద్ధాలైన నిర్ణయాలు తెలియజేస్తారు. పరిస్థితులిట్టివైతే సూత్రముల ప్రయోజనము ఏ విధంగా సాధించబడింది?

## భాషణములు 577

శుద్ధసత్ - బ్రహ్మము (స్వయంభాసి)

శుద్ధమానసము - సాత్త్విక మనస్సు = ఈశ్వర

రజస్సు

తమస్సు

అహంకారం (అహం) ఇదంతా వేదాంత పరిభాష,

జగత్తు (ఇదం)

## భాషణములు 578

ఇక్కడికి వచ్చినవారిలో కొందరు వారిగురించి వారు అడుగరు. వారు తెలియగోరేవి - జీవన్ముక్తుడు జగత్తును పరికిస్తాడా? కర్మ అతన్ని బాధిస్తుందా? తనువుపోయిన తర్వాత విమోచనమెట్టిది? ముక్తి, తనువు దొరకిన తర్వాతనా, ఇంకా ప్రాణం తనువులో ఉన్నప్పుడేనా? యోగి శరీరం తేజస్సులో లీనమౌతుందా? మరేదైన విధంగా దేహం మాయమౌతుందా? దేహాన్ని శవరూపంగా వదలిన తర్వాత గూడ యతిముక్తుడు అవగలడా?

వారి ప్రశ్నల కంతుండదు. అన్ని విధాలుగా వారినివారు బాధ ఎందుకు పెట్టుకుంటారో? వీనిని తెలిసికొంటే ముక్తి లభిస్తుందా?

అందుకే వారితో అంటాను - 'ముక్తి విషయం వదలిపేయి. ఇప్పుడు బంధమున్నదా? ఇది తెలుసుకో. మొట్టమొదట నిన్ను నీవు చూచుకో."

## భాషణములు 579

ఆవరణ జీవుని పూర్తిగా కప్పివేయదు; తానున్నానని అతనికి తెలుసు; అతనికి తెలియనిదెల్లా తానెవరనేదే. అతడు ప్రపంచాన్ని చూస్తాడు. కాని అది బ్రహ్మమేయని ఎరుగడు. అది తమోవృత్తమైన వెలుగు (అజ్ఞానాంతరితమైన జ్ఞానము). సినిమా చూపేటప్పుడు గదిని చీకటిచేస్తారు; కృత్రిమదీపకాంతిని కల్గిస్తారు. ఆ మసక వెల్తురులోనే పాత్రలను ప్రసరింపచేస్తారు.

వేర్వేరుగ విశిష్టప్రదర్శనకు ప్రతిబింబితకాంతి అవసరం. నిద్రితుడు కలగన్నప్పుడు, నిద్రిస్తూనే ఉన్నాడు; నిద్రలోని చీకటిలో, లేక అజ్ఞానంలోనే నిజం కాని స్వప్న విషయాలను చూస్తాడు.

అలాగే అజ్ఞాన తమస్సు (అజ్ఞానము యొక్క చీకటి) జాగ్రదృశ్యాల జ్ఞానానికి దారితీస్తుంది.

అజ్ఞాన

↓

అజ్ఞానము

ఆవరణ (కప్పు, తెర)

తమస్సు

↓ కప్పియుండడం అజ్ఞానపు లక్షణం - అది ఆత్మస్వభావం గాదు. అది ఆత్మనే

విధంగానూ బాధించదు. అది జీవుని మాత్రమే ఆవరించగలదు. అహంకారం జడము; ఆత్మకాంతి కొంత కలిసి జీవుడైంది. కాని ఆ కాంతినిగాని అహంకారాన్ని గాని వేర్వేరుగా జూడజాలము. ఆ రెంటి కలయిక ఫలమే జీవుడు, సర్వపృథక్కరణానికీ (వేరు అనే భావాలకీ) మూలము.

ఇంత చెప్పడం పృచ్ఛకుని తృప్తిపరచడానికే.

సహస్రారం : పృథ్వీ : అహంకారం

కంఠము : ఆకాశం : జ్ఞానం

హృదయం : వాయువు : మనస్సు

నాభి : తేజము : బుద్ధి

మూలాధారం : జలము : చిత్తము (జ్ఞప్తి)

సూక్ష్మ శరీరము ఈ విధంగా చెప్పబడింది. ఇంద్రియాలు, ఇతర అవయవాలు వేర్వేరుగా పనిచేస్తాయి. కాని అంతఃకరణాలు, ప్రాణాది వాయువులు కలిసే పనిచేస్తాయి. అందువల్ల మొదటిది. వ్యష్టి, రెండోది సమష్టి.

ఆవరణ రెండు రకాలుగ కప్పుతుంది.




ఈశ్వరునిమీద ఆధారపడకుండా జీవుడు, మాయభావన మీద ఆధారపడకుండా అజ్ఞానము ఉండలేవు. నిద్రనుండి మేల్కొన్న పిదపనే వ్యక్తి దేహాన్నీ, జగత్తునూ చూస్తాడు; నిద్రలో కాదు. ఇప్పటి ఎరుక ఆధారంగా, నిద్రలోనూ తానున్నాని గ్రహిస్తాడు. కాబట్టి నిద్ర జీవుని శుద్ధ స్థితిగానే అంగీకరించాలి. ఆ స్థితిలో ప్రపంచమూ, శరీరమూ కనిపించవు.

భక్తుడు: జీవుడు ప్రతిబింబిత కాంతి, "నేను" ఆలోచన కాదా?

మహర్షి: ప్రతిబింబితకాంతి జీవుడే. అంతకుముందు కూడా జీవుడే. వానికి కార్యకారణ సంబంధం ఉంది. నిద్రలోని జీవుడు ఈశ్వరుని నుండి స్వతంత్రించి లేడు. నిద్రలేవగానే తాను దేహం అంటాడు. విశ్వములన్నీ కలిస్తే విరాట్. అందు శరీరము అల్పాల్పబిందువు. కాబట్టి అది విరాట్ యొక్క, లేక విరాట్లోని ఒక అంశం. ఇంక జీవునికి మిగిలిందేమిటి, ఈ

దేహం తాను, ఇతరులు కారన్న గర్వం తప్పు? అతడు గూడ విరాట్నుండి స్వతంత్రంగా ఉండలేదు. ఆ రీతిగానే-

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| ఈశ్వర: కారణ సమష్టిశరీరము ప్రాజ్ఞ (గాఢనిద్రలోని వ్యష్టిశరీరము) | హిరణ్యగర్భ: కారణ సూక్ష్మశరీరము తైజస (వ్యక్తిగత సూక్ష్మశరీరము) | విరాట్: కారణ స్థూలశరీరము విశ్వ (వ్యక్తిగత స్థూలశరీరము) | మాయ: ఈశ్వరగుణ కారణ అజ్ఞానము (జీవగుణ విశిష్టము) | బ్రహ్మన్ (కారణము): జీవ (కార్యము ఫలితం) |

ఈ అయిదు గణాలను ఒకటిగా కూర్చాలంటారు. ఇదే పంచీకరణం. ఈ గొడవంతా వివాదకౌశలం మాత్రమే.

## భాషణములు 580

రాజకోట్నుంచి ఒక బృందం బస్సులో వచ్చింది. నల్గురు ముఖ్యులు, నల్గురు వనితలు, పరివారం, అంగరక్షకులూ ఉన్నారు. వారు వచ్చేప్పటికి 11 గంటలయింది. తమ గదిలో భోజనం ముగించుకొని 12.45 నుండి 13.05 గంటలవరకు వారు భగవాన్తో భాషించి వెళ్ళిపోయారు.

వారిలో ఒకరు - థాకూర్సాహెబారి తల్లి ఈవిడ. శ్రీ మహర్షి దర్శనం కోరి మేమింతదూరం వచ్చాము. దయజూపి మాకేమైనా ఉపదేశిస్తారా?

మహర్షి: (చిరునవ్వు నవ్వి) దర్శనం కొరకింతదూరం వారు రావటం మంచిదే. వారు చెప్పిందే చాలును. ఇంక నేను చెప్పేదేముంది? (భోజనం గంట మ్రోగింది) Xo. 12.45

భక్తుడు: జ్ఞాని యోగికి వేరా? భేదమేమి?

మహర్షి: శ్రీమద్ భగవద్గీతలో జ్ఞానియే నిజమైన యోగి, నిజమైన భక్తుడని ఉంది. యోగం, సాధనం; జ్ఞానం, సిద్ధి.

భః యోగం ఆవశ్యకమా?

మ: అదియొక సాధన. జ్ఞానప్రాప్తి తర్వాత యోగంతో పనిలేదు. అన్ని సాధనలకు యోగమనే పేరు. ఉదా - కర్మయోగ, భక్తియోగ, జ్ఞానయోగ, అష్టాంగయోగ. యోగమంటే ఏమి? యోగమంటే ఐక్యము. వియోగముంటేనే యోగం సాధ్యం. ఇప్పుడు వియోగంలో ఉన్నానని వ్యక్తి భ్రమపడుతున్నాడు. ఈ భ్రాంతిని తొలగించాలి. ఆ తొలగించే పద్ధతిని యోగమన్నారు.

భః ఏ విధానం ఉత్తమము?

మ: అది వ్యక్తి మనస్థితిని బట్టి ఉంటుంది. ప్రతివాడూ పూర్వజన్మల సంస్కారాలతో జన్మిస్తాడు. ఒకరికొక పద్ధతి అనువైతే మరొకరి కింకొక పద్ధతి సులువౌతుంది. దానిగూర్చి నిశ్చయమిది అనలేము.

భః ధ్యానించేదెట్లు?

మ: ధ్యానమంటే ఏమి? దాని సామాన్యార్థం ఒక ఆలోచనమీద మనస్సు నేకాగ్రం చేయడం. ఆ సమయంలో ఇతర ఆలోచనలన్నీ పక్కకు పెట్టేయాలి. ఆ ఒక్క ఆలోచన గూడ యుక్త సమయంలో తొలగిపోవాలి. ఆలోచనలు లేని చైతన్యమే గమ్యం.

భ: అహంకారాన్ని వదిలించుకొనే దెలా?

మ: అహంకారాన్ని చేజిక్కించుకొంటే, దాన్ని వదల్చుకోవచ్చు. దాన్ని మొదట పట్టుకో. తరువాత అంతా సులువే.

భ: దాన్ని పట్టుకోవట మెలాగ?

మ: ఒక అహంకారం మరొక అహంకారాన్ని నాశం చేయబోతుందా? అహంకారాలు రెండున్నాయా ఏమి?

భ: భగవంతు నేవిధంగా ప్రార్థించేది?

మ: భగవంతుడిని ప్రార్థించాలంటే అక్కడ తానొకడు ఉండి తీరాలి. తాను, అత్యంత సన్నిహితమూ, ప్రియతమమూ. దైవాన్ని అట్లనుకోరు. తనకన్న ప్రియతరమేదో కనిపెట్టు. దాని స్వరూపం నిరూపించి అవసరమైతే ప్రార్థన చెయ్యవచ్చు.

## భాషణములు 581

శ్రీ భగవాన్కని తల్లితండ్రులు తెచ్చిన నైవేద్యాన్ని బిడ్డపట్టుకొని ఉంది. వారు ప్రోత్సహించగా బిడ్డ సంతోషంగా దాన్ని భగవాన్ చేతుల్లో ఉంచింది. అప్పుడు భగవాన్ ఇలా అన్నారు: ఇటుచూడు బిడ్డ ఏదైన జేజ (దైవం) కిస్తే అది త్యాగం. జేజకు బిడ్డలపై ఎంత ప్రభావమో చూడండి. ప్రతినివేదనము నిస్వార్థాన్ని సూచిస్తుంది. నిష్కామకర్మ యొక్క సారాంశమిదే. నిజమైన త్యాగమే అది. ఇచ్చే స్వభావాన్ని పెంచితే అది త్యాగమవుతుంది. ఏదిగాని ఇష్టపడి ఇచ్చేటైతే అది ఇచ్చేవానికి పుచ్చుకొనేవానికి గూడ సంతోష దాయకము. అదే ఎవరైనా దొంగిలిస్తే, ఆ ఇర్వురికి చింతాకరమే. దానం, ధర్మం, నిష్కామకర్మ అన్నీ త్యాగమే. “మమత"ను విసర్జిస్తే చిత్తశుద్ధి; 'అహము'ను విడిస్తే జ్ఞానము. ఇచ్చేగుణము బాగా పెరిగితే అది జ్ఞానానికి తెచ్చి చేరుస్తుంది.

కొంతసేపైన తర్వాత ఒక పిల్లవాడు ఒంటరిగా వచ్చాడు. వానితో తల్లితండ్రులెవరూ రాలేదు. వాడు చెంగంనుండి బస్సులో ప్రయాణం చేసాడు. శ్రీభగవాన్ అన్నారు - ఈ పిల్లవాడు ఇక్కడికి రావడం కోసం తల్లిదండ్రులను వదలి వచ్చాడు. ఇదీ త్యాగానికొక దృష్టాంతమే."

## భాషణములు 582

శ్రీ భగవాన్ ఒక ఆంధ్రునితో అన్నారు - ఎప్పుడూ కోరుతూనే ఉంటే కోరికలకు మేరయుండదు. తృప్తియుండదు. కోరికలు లేకుండా ఉంటే, ఏది పడితే అది వస్తుంది. భార్య, సంతానం, ఉద్యోగం - వీనిలో మనం లేము. మనలో అవన్నీ ఉన్నవి. వాని రాకపోకలు, అంతా ప్రారబ్ధవశం.

నిశ్చలంగా ఉన్న మనస్సు సమాధి. ప్రపంచాన్ని గుర్తించినా గుర్తించకున్నా. పరిసరాలు, కాలము, విషయములు, అన్నీ నాలోనున్నవి. అవి నానుండి భిన్నంగా, స్వతంత్రంగా ఎలా ఉండగలవు? అవి మారవచ్చు. కాని నేను ఎప్పుడూ మార్పు లేకుండా, ఒకే విధంగా వుంటాను. విషయాలను నామరూపములను బట్టి వేర్వేరుగా విభజించవచ్చు. కాని ప్రతివాడి పేరూ ఒకటే - అదే 'నేను'. ఎవర్ని అడిగినా 'నే'నంటాడు. తన్నుగూర్చి చెప్పేటప్పుడు 'నేనే' అంటాడు. అతడీశ్వరుడైనా సరే, ఆయన పేరు సైతం 'నేనే'.

* స్థానము విషయమూ అంతే. దేహాత్మబుద్ధి ఉన్నంతవరకూ, ఆవాసమొకటి

వేరేగా గుర్తించ దగినదిగా ఉంటుంది. అలా కాకపోతే ఆ స్థానం ఉండదు. నేనేమి దేహమునా? దేహముతన్ను 'నే'నని ప్రకటించుకొంటుందా? ఇవన్నీ నాలో ఉన్నవనడం స్పష్టమే. వీనినన్నింటినీ నిర్మూలింపగా మిగిలియున్న శాంతి 'నేను'. ఇదే సమాధి. ఇదే 'నేను'.

## భాషణములు 583

వి. గణపతిశాస్త్రి భగవాన్కొక ఉత్తరం చూపాడు. మెర్సిడిస్ డి అకోర్టా, అని యొక స్పెయిన్ దేశస్థురాలు మరురోజు : 'ఇక్కడికి వస్తున్నా'నని వ్రాసింది. 'నేనిక్కడుంటే, ఎంతమంది కెంతకష్టమో చూడండి' అన్నారు శ్రీ భగవాన్.

## భాషణములు 584

ఒక దర్శనార్థి పంకా లాగసాగాడు. భగవాన్ అన్నారు - "చలి యని నా ప్రక్కనే ఒక కుంపటి ఉంచారు. మరి పంకా లాగడమెందుకు?" భగవాన్ అంతతో ఆపలేదు - "అవి చలిరోజులు. ఒకరోజు ప్రొద్దున విరూపాక్ష గుహయొద్ద ఆరుబయట కూర్చున్నాను. నాకు చలివేస్తున్నది. జనం వచ్చేవారు; నన్ను చూచి వెళ్ళేవారు. ఆంధ్రులు కొందరు వచ్చారు. వారేంచేస్తున్నారో చూడలేదు. వారు నా వెనుకగా ఉన్నారు. ఉన్నట్టుండి 'ఠక్'మని శబ్దం బుడబుడ నా నెత్తిపై నీరు. చలితో వణికిపోయాను. వెనుదిరిగి చూస్తే, వారు టెంకాయకొట్టి నీరు నాకభిషేకం చేశారట. వారదింతా పూజయనుకొన్నారు. నేనొకరాతి విగ్రహంగా భావించారేమో?"

## భాషణములు 585

మహర్షి: ఈ ఊరొక విచిత్రమైన ఊరు. రైలుమార్గం మినహాయిస్తే ఇచటికి చేరుకోడానికి దారులు తొమ్మిది. "నవద్వారే పురేదేహీ" (శరీరంలో - నవద్వారపురంలో)

## భాషణములు 586

ఆంధ్రులొకరు: శాంతంగా ఉండేదెలా? అట్లుండటం చాలా కష్టం. దానికై యోగమభ్యసించాలా? కాకపేరేమైన ఉపాయమున్నదా?

మహర్షి: కష్టం కానిది కష్టంగా కనిపిస్తుంది. ఒకనికి తిరుగుడు అలవాటు. వానిని శాంతంగా ఇంట్లో ఉండమంటే అది వానికి చాల కష్టం. ఎందుకంటే అతనికి తిరగడం అలవాటు కాబట్టి.

భక్తుడు: అన్నిటికంటే ఎక్కువ ఫలదమైన ఉపాసన ఏదైనా ఉందా?

మహర్షి: ఫలప్రదానంలో ఉపాసనలన్నీ సమానాలే. వానివాని పూర్వ వాసనలను బట్టి, ఎవరికేది సులువో వాడు దాన్ని అభ్యసిస్తాడు.

## భాషణములు 587

ఆ స్పానిష్ వనిత, ఆమె స్నేహితురాలు వచ్చిచేరారు. వారడిగారు: "హృదయం కుడివైపున అని మీరు చెప్తారు. అదెట్లో దయచేసి వివరించండి." శ్రీ భగవాన్ ఫిలడల్ఫియా ప్రచురణం "సైకలాజికల్ రివ్యూ" పత్రిక ప్రతినొకటిని చదువమని ఆమెకిస్తూ, అన్నారు “నేను” అన్న ఆలోచన ఎక్కడనుండి కలుగుతుందో అది హృదయం.

భక్తురాలు: అంటే ఆధ్యాత్మిక హృదయం భౌతిక హృదయానికి పేరన్నమాట. మహర్షి: అవును. ఈ విషయం రమణగీత 5వ అధ్యాయంలో వివరించబడింది. భ: హృదయం విదితమయ్యేదశ ఏదైనా ఉందా?

మహర్షి: అది ప్రతియొక్కరి అనుభవంలోనిదే. "నేను" అంటూ ప్రతివాడూ వక్షస్సు కుడివైపునే తాకి చూపుతాడు.

ఆ వనితలిద్దరూ భగవాన్ ఎదుట మోకరిల్లి ఆశీస్సులర్థించారు. వారు కొలంబో వెళ్ళుతూ దారిలోని పాండిచ్చేరికి వెళ్ళిపోయారు.

## భాషణములు 588

ఆంధ్రులొకరు సాధన చేస్తున్నారు. ఆయనతో శ్రీభగవానన్నారు.

"అర్జునికై సన్న్యాసము చెప్పబడింది. త్యజించవలసింది వస్తువిషయాదులగాదు. వానియందలి ఆసక్తిని. ఎవ్వరైనా సన్న్యాసాన్ని ఇంటివద్ద గూడ అభ్యసించవచ్చు. వానికి యోగ్యత ఉంటేసరి, మరియు

"కుటీచకుడు" = సన్న్యాసం తీసుకొని కుటీరంలో వసించేవాడు.

"బహూదకుడు" = సన్న్యాసం తీసుకొని తీర్థయాత్రలు చేసేవాడు.

"హంస "= ఉపాసక సన్న్యాసి.

"పరమహంస" = ఆత్మజ్ఞుడైన సన్న్యాసి.

## భాషణములు 589

చిరకాలభక్తుడు సోమసుందరస్వామి భగవాన్ను ప్రశ్నించాడు.

భక్తుడు: అద్దంలో ఆకాశముంది. అది వస్తువులను ప్రతిబింబిస్తుంది. ఇవన్నీ అద్దంలో ఎలా ఇముడుతాయి?

మహర్షి: విషయాలు ఆకాశంలో ఉంటాయి. విషయాలూ, ఆకాశం రెండూ అద్దంలో ప్రతిబింబిస్తాయి. విషయాలు ఆకాశంలో ఉన్నట్లే ప్రతిబింబంలోనూ ఉంటాయి. అద్దం చాల పల్చన, దాని పరిమితిలో ఈ విషయాలు ఎలా పట్టగలవు?

భ: ఘటాకాశం ఉదాహరణ ఈ విషయాన్ని ఎలా వివరించగలదు?

మ: ఘటాకాశంలో ప్రతిబింబము లేదు. (ఘటము అంటే కుండ) ఆ ప్రతిబింబం ఆ కుండలోని నీళ్ళలోనే. చెరువులో నీరు కుండలలో నింపితే, అన్ని కుండలలోనూ చెరువులోకూడా సమానంగానే ఆకాశం ప్రతిబింబిస్తుంది. అలాగే ప్రతివ్యక్తిలోను, సర్వవిశ్వమూ ప్రతిఫలిస్తుంది.

భ: కుండల ముఖాలన్నీ చెరువులోని నీటిమట్టానికి పైగానే ఉండవలెగదా?

మ: అవునట్లే. చెరువులో నీటియడుగున కుండలు మునిగివుంటే గుర్తించగలమా?

భ: కుండలలో ప్రతిబింబం ఎలా కలుగుతుంది?

మ: శుద్ధాకాశంలో ప్రతిబింబాలు కనబడవు. నీటిలోని ఆకాశానికే ఆ శక్తి వుంది. వట్టి అద్దం విషయాలను ప్రతిబింబించదు. దాని వెనుక వెల్తురు చొరబారని రసంపూస్తేనే ఎదుటనున్న విషయాలను ప్రతిఫలించగలదు. అలాగే శుద్ధజ్ఞానంలో విషయాలుండవు; వానినది ప్రతిఫలింప చేయనూచేయదు. ఉపాధియైన మనస్సుతో కూడితేనే అది ప్రపంచాన్ని ప్రతిబింబిస్తుంది.

సమాధిలోగాని, గాఢనిద్రలోగాని ప్రపంచము లేదు. దట్టమైన చీకటిలోనూ, ఉజ్జ్వలతేజంలోను, భ్రమ మిథ్యారోపములుండవు. త్రాడుపాముగా తోచేది మసక వెల్తురులోనే. శుద్ధచైతన్యం తేజంగానే ఉంటుంది. అది కేవలజ్ఞానము. దానినుండి వెడలిన మనస్సు విషయాలు వేర్వేరని భ్రాంతిల్లుతుంది.

భ: కాబట్టి మనస్సే దర్పణం.

మ: మనస్సు – మనస్సు! అదేమి? అది చిత్సంకల్పాల (చైతన్యం – ఆలోచనల) మిశ్రమం. అందుచేత అది ఇవన్నీ: దర్పణము, వెలుగు, చీకటి, ప్రతిబింబాలూ.

భ: కాని నాకవి కనిపించడం లేదు.

మ: చిదాకాశం శుద్ధజ్ఞానము మాత్రమే. అది మనస్సుకు మూలము. ఉద్బుద్ధమయ్యే ఆ క్షణానికి మనస్సు కేవలము కాంతి. దాని తర్వాతే "నేన - ఇది" అనే ఆలోచన పుడుతుంది. ఈ "నేను" ఆలోచనే జీవుడు - ప్రపంచంగా గోచరిస్తుంది.

మొట్టమొదట కాంతే శుద్ధమనస్సు, చిదాకాశం లేదా ఈశ్వరుడు. దాని వ్యక్తీకరణ స్థితులే విషయాలుగా గోచరిస్తాయి. విషయాలన్నీ దానిలోనే ఇమిడి ఉన్నాయి గనుక, దాన్ని చిదాకాశమన్నారు. ఆకాశమనుటెందుకు? ఆకాశం విషయాలనువలె, అది ఆలోచనలను భరిస్తుంది. అందువల్ల అది మానసాకాశము. స్థూలవిషయాలన్నిటినీ (సర్వవిశ్వాన్నీ) ధరించే భూతాకాశము, తాను మానసాకాశంలోని విషయమైనట్లే, మానసాకాశము తానూ చిదాకాశంలోని విషయమే. దానికినీ చివరది కేవలము చిత్. అందులో విషయమేదీ ఉండదు. అది కేవల జ్ఞానమాత్రంగా నిలిచియుంటుంది.

భ: దాన్ని ఆకాశమనుటేమి? భూతాకాశము జడము కదా?

మ: 'ఆకాశ'పదము, జడమైన భూతాకాశాన్నేగాక, శుద్ధజ్ఞానాన్ని కూడ తెల్పుతుంది. జ్ఞానం అంటే విషయజ్ఞాన మాత్రంకాదు; అది సాపేక్షజ్ఞానము. కాని శుద్ధజ్ఞానము ఒంటిగా, ఏకమూ, విలక్షణమూ, అన్నింటికీ పరముగా ఉన్న ప్రకాశము.

భ: సరి. దానిని ధ్యానంలో ఊహిస్తూవుండాలా?

మ: ఊహించడమెందుకు? ఊహించడం అనేది అది మనకు వేరుగా ఉంటేనే చేయగలం. శుద్ధజ్ఞానానికి వెలిగా మనకు ఉనికియే లేదు. నిజానికి ఉన్నది అది మాత్రమే. అది ఫలానా, ఫలానాయని, ఇట్టిదట్టిదని ఎలా ఊహించడం?

భ: మరి ముందు చేయవలసిందేమి?

మ: అనాత్మను వదల్చుకోవడమే.

భ: వినడానికిపుడు బాగానే వుంది. కాని తరువాత దాన్ని పూర్తిగ మరచిపోతాము.

మ: మరచిపోవడం అంటే దానికి ముందు తెలిసియుండాలిగదా? మరచానని నీవు అంటే దానికి ముందు తెలుసు అని అర్థం. తెలియకపోతే మరిచానని నీవెలా చెప్పగలవు? కాబట్టి మరపు గూడ చిదాకాశమే.

భ: అయితే నాకది స్పష్టంగా లేదెందుచేత?

మః చిత్ కేవలము, శుద్ధము. మనస్సు దానినుండి వెడలివస్తుంది. మనస్సు ఆలోచనల నిర్మాణము. తమస్సు లేక అజ్ఞానం అడ్డుపడడం వలన శుద్ధజ్ఞానము నిజస్థితికి వేరుగా కనిపిస్తుంది. అదే కామ మోహ మద మాత్సర్యాదులతో నిండి "ప్రపంచంగా" "నేను"గా కన్పిస్తుంది. అందుచేత కామాదులు సత్యమును కప్పి ఉంచుతాయన్నాయి.

భ: ఆలోచనలను వదల్చుకొనే దెలా? "ఆత్మవిద్య"లో చెప్పినట్లేనా .... "మనమును కన్నుకన్నె..."

మ: అక్కడ మనస్సంటే ఆకాశము, ఉనికి (సత్), 'కన్ను అంటే జ్ఞానం (చిత్); సత్తు కలిసి ప్రపంచంగా అయ్యేయి.

భ: దీన్ని అనుభవంలోకి తెచ్చుకొనేదెలాగ?

మ: 'ఆత్మవిద్య'లో చెప్పియున్నట్లే - మనోనేత్రానికి నేత్రమై, మనోకాశానికి ఆకాశమై ..." అంటే సాపేక్షజ్ఞానానికి ఆధారజ్ఞానము, మానసాకాశమును ధరించి ఉన్న చిదాకాశము, ఏకైకమే, సదా ఉజ్జ్వలజ్యోతిగా మిగులుతుంది.

భ: ఇప్పటికీ నాకు తెలియడం లేదు. దానిని సిద్ధింపచేసుకునేదెలాగ?

మ: ఆలోచనలు లేకుండా ఉండు ... అంతర్ముఖమైన మనస్సునందే అది అనుభూతమౌతుంది. కాబట్టి ఆలోచనలు వదలి, లోహృదయంలో విలీనమైన మనస్సు, అదే చిత్.

భ: ఈశ్వరుడైనా, హిరణ్యగర్భుడైనా, పై దెల్పిన మానసాకాశమేనా?

మ: చిదాకాశము లేక మానసాకాశముండగలదా? అట్లే ఈశ్వర హిరణ్యగర్భులు కూడా.

భ: వారిర్వురిలో భేదమేమి?

మ: ఈశ్వరుడు ప్రత్యక్షమూర్తి.

భ: చిదాకాశమాత్రమే ప్రత్యక్షమూర్తి కాదా?

మ: ప్రత్యక్షం కాగల్గితే మాయతోకూడినప్పుడే. మాయతో కలసిన ఉనికి తెలియుటే ప్రత్యక్షం కావడం. దీని నుంచి మరియొక సూక్ష్మ కల్పన హిరణ్యగర్భ; దాని నుండి స్థూలకల్పన, విరాట్టు. చిదాత్మ శుద్ధస్థితి మాత్రమే.

## భాషణములు 590

ఇర్వురు స్త్రీలు, ఒకరు స్విస్, మరొకరు ఫ్రెంచి. వాళ్ళు మహర్షి దర్శనం

చేశారు. వారిలో చిన్న ఆమె చాల ప్రశ్నలడిగింది. వానిలో ముఖ్యమైనవి. భక్తురాలు: బ్రహ్మమూ, జీవుడూ ఒకటే. జీవుడు మాయావృతుడైతే, బ్రహ్మమునకూ మాయకప్పినట్లే? అదెట్లు సాధ్యం?

మహర్షి: ఒకవేళ బ్రహ్మమును మాయ యావరించి, అతనికి ముక్తి కావలసి వస్తే, అతడినే ప్రశ్నించనీ.

గురుసన్నిధిలో వున్న సాధకులకు దర్శన స్పర్శనాదుల ద్వారా అనుగ్రహము లభించగలవు. అట్టి అనుగ్రహము దూరాన ఉన్న వారికి ఎలా లభిస్తుంది.

మహర్షి: యోగదృష్టిచేత.

చోప్రా, పంజాబీ, సింగపూరులో ఉద్యోగం చేస్తూ మహర్షిని చూడవచ్చాడు.

అతడు ప్రశ్నించాడు -

భ: నామము యొక్క ప్రయోజనమేమి?

శ్రీ భగవాన్ విజన్ పత్రికలోని వ్యాసభాగం చదివి విన్పించారు. దానిలో

నామదేవ్ గీతాల కనువాదమున్నది.

భ: అనుభవానికి నామస్మరణ ఎలా ఉపకరిస్తుంది?

మ: అన్నింటికీ మూలమైన నామం, ఏ వ్యక్తీ ప్రయత్నింపకనే తానై స్మరింపబడుతున్నది. ఆ పేరు 'అహం' (నేను). అది వ్యక్తమైనప్పుడు అహంకారముగా - జీవాత్మగా వెలువడుతుంది. వాచా జరిగే నామస్మరణ, మానసికానికి దారితీసి, చివరకు నిరంతర స్పందనంగా పర్యవసిస్తుంది.

భ: కాని ఇవన్నీ శారీరకాలా, మానసికాలా?

మ: మనస్సుగాని, వాక్కుగాని ఆత్మలేక పనిచేయలేవు. ప్రసిద్ధ మహారాష్ట్ర యతి, తుకారాం పగలెల్ల సమాధిలోనుండి, రాత్రిళ్ళు జన బృందంలో చేరి భజన నృత్యం చేసేవాడు. అతడు నిరంతరం రామనామస్మరణ చేసేవాడు. ఒకనాడు కాలకృత్యాలవేళలో గూడ రామనామ ముచ్చరిస్తున్నాడు. ఒక శిష్ట పురోహితుడు దివ్యనామ మా విధంగా మైలపడటం సహించలేక, తుకరాంను కఠినంగా మందలించి, ఇకపైన అట్టి వేళల్లో నోరుమూసుకుని మౌనంగా ఉండమన్నారు. సరేనని మౌనం దాల్చాడు తుకారాం. కాని తక్షణమే అతని రోమకూపాలనుంచి రామనామఘోష మ్రోగసాగింది. ఆ శబ్దానికి భయభ్రాంతుడై ఆ పురోహితుడు. "స్వామీ, విధి నియమాలు సామాన్యులకేగాని తమవంటి యోగులకు గావు. క్షమింపు"మని వేడుకున్నాడు.

భ: తాను పూజించే కాళీవిగ్రహంలో శ్రీరామకృష్ణులు జీవచైతన్యం చూచారంటారు. అది నిజం కాగలదా?

మ: ఆ జీవచైతన్యం ఒక రామకృష్ణులకే కనుపించింది; అందరికీ గాదు. ఆ ప్రాణశక్తి కారణం ఆయనే. ఆయనదే అయిన ప్రాణశక్తియే, ఏదో వెలుపలినుండి ఆయన్నాకర్షించినట్లుగా వ్యక్తమయింది. విగ్రహమే సజీవమైయుంటే అందరికీ అలాగే గోచరించాలి. ఒకటి నిజం; అన్నీ ఆ జీవంతోనే నిండి వున్నాయి. చాలమంది భక్తులు శ్రీరామకృష్ణులవలె అనుభూతిగల్గినవారున్నారు.

భ: రాయి అచేతనంగదా? దానిలో జీవమెట్లుంటుంది?

మ: విశ్వమంతా జీవభరితమే. రాయి అచేతనమన్నావు. నీఆత్మచైతన్యము అచేతనాన్ని ప్రస్తావిస్తున్నది. చీకటిలోని వస్తువును వెదకేవాడు. దీపం తీసుకొనిపోతాడు. ఆ వస్తువుందో లేదో తెలియడానికి దీపం ఉపయోపడింది. ఒక విషయం

సచేతనమో కాదో గుర్తించటానికి చైతన్యం అవసరం. చీకటిలో నున్నది మనిషయితే, ఏ దీపమూ అక్కరలేదు. పిలిస్తే పలుకుతాడు, తానున్నానని ప్రకటించడానికి. ఆ రీతిగా చైతన్యం స్వయందీప్తము.

నిద్రలో ఇట్టి చైతన్య మెరుగవనీ, ఇప్పుడు జాగ్రత్తులో ఆత్మ చైతన్యం తెలియవస్తున్నదనీ అంటావు. ఇందులో నిజమేది? సత్యం నిరతమూ నిత్యంగా ఉండాలి ప్రస్తుత చైతన్యంగాని, అది లేకపోవడంగాని నిజాలు గావు. కాని అప్పుడూ ఇప్పుడూ గూడ నీ వుంటూనే వున్నావు. ఆ శుద్ధస్థితియే సత్యం. ఇతరములన్నీ అనుబంధాలే. ఆ శుద్ధస్థితి చిత్క్యంగా ఉండలేదు. లేకపోతే నీవున్నావని చెప్పలేవు. అందుచేత ఎరుక సత్యము. ఆ ఎరుక ఉపాధిగతమైనప్పుడు ఆత్మచైతన్యమనీ, అచేతనమనీ, ఊన (సబ్) చేతనయనీ, అధిచేతనయనీ, మానవచైతన్యమనీ, శునకచైతన్యమనీ, వృక్షచైతన్యమనీ, ఇలా పలువిధాలుగా వర్ణిస్తావు. వీని కన్నిటికీ మారని సమాన ధర్మము చైతన్యము.

ఆ రీతిగా, నిద్రలో నీవు ఏవిధంగా అచేతనమో అదే విధంగా రాయి కూడా అచేతనం. కాని చైతన్యం అసలే లేదంటావా?

భ: కాని శునకానికి గల ఎరుకకు, నా ఎరుకకూ వ్యత్యాసము లేదా? కుక్కకు బైబిల్ చదివి వినిపించలేను. నేను కదులుతాను, క్రియలాచరిస్తాను చెట్లు అది చేయలేవు.

మ: అలా అయితే చెట్టును నిలుచున్న మనిషి అనీ మనిషిని కదలే చెట్టు అని పిలువు.

ఈ సంవాదంలో పాల్గొంటున్న మరొక అమెరికన్ భగవాన్ ను వివరింపనీయలేదు. అందుచే సంవాదం ముగిసిపోయింది.

## భాషణములు 592

నిన్నటి భాషణలో, కొందరీ స్త్రీలతో మాట్లాడేప్పుడు భగవాన్ భ్రమరకీట న్యాయాన్ని ప్రస్తావించారు. పంజాబి యొక రా విషయం ప్రస్తావిస్తే శ్రీ భగవాన్ కొన్ని ముచ్చటైన ప్రాత స్మృతులను చెప్పారు.

1. భ్రమరకీట న్యాయమని ముందే వినియున్నాను. తిరువణ్ణామలై వచ్చాక, కొన్నాళ్ళు గురుమూర్తంలో ఉండగా దాన్ని చూచాను. ఒక ఎర్రటి కందిరీగ గూడు కడుతూ, అందులో అయిదారు కణాలేవో ఉంచి ఎగిరిపోయింది. నాకు కుతూహలం కలిగి పలుమార్లు పదిమందీ చెప్పే ఆ న్యాయమేదో పరీక్షిద్దామనుకొన్నాను. సుమారు పదిరోజులువేచి, తరువాత ఆ గూటిని తట్టి చూచాను. గూడు వీడి వచ్చింది! ఆ విషయం చూస్తూ ఉండగానే ఆ అయిదారు కణాలు ఒకటిగా కలిసి కందిరీగ ఆకారంతో తయారయింది. కాని అది తెల్లగా ఉంది.

2. విరూపాక్ష గుహలో ఉన్నప్పుడు ఒకసారి ఒక ఎర్రని కందిరీగ అయిదారు గూళ్ళుకట్టి ఒక్కొక్క దానిలో అయిదారు కణాలుంచి ఎగిరిపోయింది. పదిరోజులు తర్వాత ఒక నల్ల తుమ్మెద ఆ కందిరీగకన్న చిన్నది, ఆ గూళ్ళ చుట్టూ ఝూంకరిస్తూ తిరుగుతూ, గూళ్ళ ద్వారాలను ఎదో నల్లని మట్టితో మూసివేసి ఎగిరిపోయింది. నా కాశ్చర్యమయింది, కందిరీగ గూళ్ళతో ఈ తుమ్మెదకే ప్రమేయమని. ఇంకా కొద్ది రోజులైనాక, మెల్లగా ఒక గూడు పగిల్చి చూసాను. అయిదారు నల్లని ఆకారాలు బయటికి వచ్చాయి. ఒక్కొక్కటి, ఒక తుమ్మెద! వింతగా ఉందే అనుకున్నాను.

3. ఇంకొకమారు. అప్పుడు పచ్చైయమ్మన్ కోయిల్లో నున్నాను. ఎర్రని కందిరీగ యొకటి గుడిలో ఒక స్తంభం పైన అయిదారు గూళ్ళుకట్టి, వానిలో ఒక్కొక్క దానిలో అయిదారు కణాలుంచి ఎగిరిపోయింది. చాలా రోజులు నిదానించి చూసాను. కందిరీగ తిరిగి రాలేదు. నల్లని తుమ్మెదా అగుపించలేదు. పదిహేనురోజుల తర్వాత ఒక గుడ్డు పగిల్చి చూచాను. ఆ గుడ్లన్నీ కలిసి ఒక తెల్లని ముద్దగా, కందిరీగ ఆకారంలో ఉంది. అది క్రింద పడి స్తంభించి పోయింది. కొన్ని నిమిషాల కది మెల్లగా ప్రాకసాగింది. దాని రంగు క్రమంగా మారుతున్నది. ఇంతలో దాని రెండు పార్శ్వాల్లో రెండు చిన్న-నల్లటి చుక్కలవుపించి, నేను చూస్తుండగానే రెక్కలై పూర్తిగ ఎదిగిన కందిరీగ నేలపై నుండి ఎగిరిపోయింది.

4. చూతగుహలో నుండగా, ఒక గొంగళి పురుగులాంటిది గోడపైకి ప్రాకడం చూసాను. ఒకచోట అది నిలిచి రెండుచోట్ల రెండు చుక్కలు గుర్తుంచి, తనలో నుంచి వచ్చిన తెల్లనిపొరతో ఆ రెంటినీ కలిపింది. ఆ పొరనది నోట గరచుకొని, తోకతో గోడ నంటిపెట్టుకొని యుంది. ఆ విధంగా కొన్ని రోజులు గడిచాయి. నేను గమనిస్తూనే ఉన్నాను. కొంతకాలానికది ముడుచుకొనిపోయింది. దానిలో జీవమున్నదాయని సందేహం కలిగింది. ఒక సన్నని ఈనెతో కదల్చి చూచాను. లోపల ప్రాణం లేదు. దాని నక్కడే వదిలేసాను. కొద్దిరోజుల తర్వాత చూస్తే, అక్కడ సన్ననిపొర మాత్రం వదిలి, ఆ లోపలిది ఎగిరిపోయింది.

5. నేను కొన్ని ఈగలను కూడా చూచాను. అవి ఏవో కణాలను నోటగరచుకొని వానిని ఉచ్ఛిష్టంపైనో, మలంపైనో వదలి వెళ్ళేవి. కొన్నాళ్ళకా కణాలు ఈగలై ఎగిరిపోయేవి.

భ: అవి ఈగ గ్రుడ్లు కావచ్చు.

మ: కాని అవి కదలి, మెలిదిరిగి, చివరకు ఈగ ఆకారం దాలుస్తాయి.

## భాషణములు 593

భగవాన్ మరొక చిత్రం జ్ఞప్తికి తెచ్చారు. 'నా చిన్నతనంలో ఇది చూచాను. బెస్తలు పారుతున్న నీటిని కొయ్యలోనికి మళ్ళించి ఆ నీరునొక కుండలోగుండా పోయేట్లు చేస్తారు. ఆ మారుదారిలో పొగాకు మొదళ్ళు పరచి ఉంచుతారు. పెద్ద చేపలు విధిగా ఆ దారినే వెళ్ళి కుండలోపడేవి. బెస్తవాని పని అక్కడే ఆ కుండ ప్రక్కనే నిశ్చబ్దంగా కూర్చోడమే. వాడా చేపలను పట్టి వారి బుట్టలలో గిరవాటు వేసేవాడు. ఆ రోజుల్లో మాకది వింతగా ఉండేది. తర్వాత నేనిక్కడ ఉండగా ఎవరో తాయుమానవర్ పాటనొకటి పాడుతుంటే విన్నాను; దానిలో చేపలను పట్టే ఈ పద్ధతే వర్ణించియుంది.

## భాషణములు 594

ఆ స్పానిష్ వనిత, మెర్సిడీస్ ది అకోర్టా, రెండు నెలలుగా ఆశ్రమంలో ఉన్న శ్రీహిగ్ (అమెరికాకు చెందిన మైనింగ్ ఇంజనీరు) కొక ఉత్తరం వ్రాసింది. దానిలో కొన్ని ప్రశ్నలున్నాయి - “జీవాత్మ పరమాత్మలో లీనమైతే, మానవోద్ధరణకై దైవాన్ని ప్రార్థించేదెట్లు?" పాశ్చాత్యుల్లో ఈ ప్రశ్న సర్వసాధారణమని తోస్తుంది.

శ్రీభగవాన్ అన్నారు - దైవప్రార్థన చేసి "నీ ఇచ్ఛయే జరుగుగాక" అని ముగిస్తారు. అదే సరియైతే ఈ ప్రార్థనెందుకు? నిజమే, అన్ని కాలాల్లో, అన్ని పరిస్థితుల్లోనూ దైవేచ్ఛయే ప్రవర్తిల్లుతుంది. వ్యక్తులు తామై చేయగల్గింది లేదు. దైవశక్తిని గుర్తించి ఊరకే యుండు. ప్రతియొక్కరినీ దైవమే చూచుకొంటాడు. సర్వం సృష్టించిందీ ఆయనే. ఎన్నోకోట్ల జనుల్లోన నీవొకడివి. అందరీ చూచుకొనేవాడు, నిన్నొక్కణ్ణి మానివేస్తాడా? ఆయన ఇచ్ఛపై అన్నీ వదలివేయడం మంచిదని ఏపాటి తెలివి ఉన్నా గ్రహించవచ్చు.

అదీగాక నీకేం అవసరమో ఆయనకు తెల్పనక్కరలేదు. ఆయనకు అవి తెలుసు? ఆయనే వాటిని చూసుకుంటారు.

అంతేకాదు. నీవు ప్రార్థించేది దేనికని? నీవు నిస్సహాయుడవనీ, ఏదో ఉత్తమశక్తి నీకు సాయపడవలెననీ, బాగానే ఉంది. కాని నిన్ను సృజించి రక్షించేవాడు, ఆయనకు నీ దౌర్బల్యం తెలియదా? నీ వాయన ఎదుట దాన్ని ప్రకటిస్తే గాని ఆయన కర్థంగాదా?

భక్తుడు: తనను తాను సహాయం చేసుకొనే వానినే దైవం రక్షించేది.

మహర్షి: నిజమే. నీకు నీవు సహాయం చేసుకో. అది దైవేచ్ఛయే. ప్రతీ చిన్నపనీ ఆయన ప్రోత్సాహంవలనే జరుగుతుంది. ఇతరుల కొరకై ప్రార్థించటం గురించి చూస్తే, పైకది చాల నిస్స్వార్థంగా ఉంటుంది. కాని ఆ భావాన్ని తరచి చూడు. దానిలో

స్వార్థం తొంగి చూస్తుంది. ఇతరుల సౌఖ్యం నీవు కోరడం, నీ సుఖం కొరకే. కాకపోతే ఒరుల పై దైవాన్ననుకూలింపచేసానన్న కీర్తికై కూడ కావచ్చు. దైవానికి ఎవరుగాని మధ్యవర్తియెందుకు? నీ పని నీవు చూచుకో. అంతా చక్కబడుతుంది.

భ: దైవం తన యిచ్ఛ నెవరో యొక ఎన్నదగ్గ వ్యక్తి మూలంగా ప్రవర్తిల్ల చేయటం లేదా?

మ: దైవం అందరిలో ఉన్నాడు. అందరి ద్వారా వ్యవహరిస్తాడు. కాని విశుద్ధ మనస్కుల్లో ఆయన ఉనికి ఎక్కువగా గుర్తించవచ్చు. కల్మషము ఉన్నవారి యందుకంటే, శుద్ధులందే ఆయన చేతలు స్పష్టంగా ప్రతిఫలిస్తాయి. అట్టి వారిని దైవాంశులుగా భావిస్తారు గాని, వారు తామట్టివారమని చెప్పుకోరు. మానవునికీ దైవానికి మధ్యస్థుణ్ణని ఎవరన్నా చెప్పుకుంటే, అతడింకా తన వ్యక్తిత్వాన్ని మిగుల్చుకొన్నాడనీ, అతని శరణాగతి పూర్ణంగాదనీ స్పష్టమే.

భ: దైవానికీ ఇతరులకూ మధ్యవర్తులు బ్రాహ్మణ పురోహితులు కాదా?

మ: నిజమే. కాని బ్రాహ్మణుడంటే ఎవరు? బ్రహ్మమెరిగిన వాడు, బ్రాహ్మణుడు అట్టి వానిలో వ్యక్తిత్వభావనే ఉండదు. మధ్యవర్తినని అతడనుకోనూ లేడు.

ఇక ప్రార్థన విషయమా? ఆత్మజ్ఞుడు తానూ ఇతరులూ వేరనుకోడు. అతడేమని ప్రార్థించటం, ఎవరిని, దేనికి? ఆయన సన్నిధి మాత్రంగానే అందరికీ ఆనందపరమావధి కల్గుతుంది. నీకు వెలిగా ఒరులున్నారనుకొన్నవరకే వారికై నీ ప్రార్థన. కాని ఈ భేదభావన అజ్ఞానం వల్ల. ఈ అజ్ఞానమే నీ నిస్సహాయ భావనకు కారణం. నీవు దుర్బలుడవనీ సాయమెవరూ లేరనీ నీకు తెలుసు. మరి ఇతరుల కెట్లు సాయపడతావు? 'దైవాన్ని ప్రార్థించి'యంటావా, దైవానికి ఆయన పని తెలియదా? ఆయనకు ఇతరుల కోసం నీ విన్నపాలు అవసరం లేదు.

నీకు నీవు సహాయం చేసుకో దాని వలన నువ్వు బలం పొందుతావు. పూర్ణశరణాగతి వలన అది సాధ్యం. అంటే ఆయనకు నిన్నర్పించుకొన్నావని. ఆపైన నీకు వ్యక్తిత్వమసలుండలేదు. అప్పుడే నీవు దైవేచ్ఛపై ఆధారపడు. నీవు సాధించగల వానిలో నత్యుత్తమము మౌనమే.

మౌనమొక సముద్రము. మతములనే అన్ని నదులూ తమ తమ జలాలనందే లీనం చేస్తాయి, అన్నారు తాయుమానవర్. మతాన్ని వేదాంతాన్ని ఏకంచేసేది ఒక్క వైదికమతమేనని ఆయన అన్నారు.

## భాషణములు 595

వచ్చియున్న ఆ ఇర్వురు స్త్రీలు ప్రొద్దుటే భగవాన్ను దర్శించుకొన్నారు. వారిలో ఆ చిన్న ఆమె -

భక్తుడు: పరమస్థితి అనుభూతి అందరికీ ఒకే విధంగా ఉంటుందా? దానిలో తరతమాలున్నాయా?

మహర్షి: పరమస్థితి యొక్కటే; దాని అనుభూతీ ఒక్కటే.

భః కాని పరమసత్యాన్ని గూర్చి భిన్నభిన్నంగా వ్యాఖ్యానాలు కనబడుతున్నాయి.

మ: వ్యాఖ్యలు మనఃకృతాలు. మనస్సులు వేరువేరు; అందువలన వ్యాఖ్యలు కూడా వేర్వేరుగా ఉంటాయి.

భః ఆత్మద్రష్టలు భిన్నభిన్నంగా ప్రవచిస్తారాయని నా ప్రశ్న.

మ: వివరణాలు వివిధంగా ఉండవచ్చు. అది సాధకుల స్థితినిబట్టి; ఆ ప్రవచనాలు సాధకుల మార్గదర్శనానికి.

భ: ఒకరు క్రైస్తవ మత ప్రాదిపదికపై మాట్లాడుతారు; మరొకరు ఇస్లాం దృష్ట్యా; ఇంకొకరు బౌద్ధం ఆలంబనంగా. ఇది వారి వారి జీవికను బట్టి
(పెరిగిన విధానం బట్టి) ఉంటుందా?

మ: వారే విధంగా పెరిగియున్నా, వారి అనుభూతి సమానమే. కాని పరిస్థితులనుబట్టి చెప్పే విధానం మారుతుంది.

## భాషణములు 596

ఒక దర్శనార్థి: నిన్న సాయంత్రం భగవాన్ దైవమే సర్వం నడపుతాడన్నారు. అట్లైతే దేనికిగాని మనమెందుకు ప్రయత్నించాలి?

మ: నిన్ను ప్రయత్నించమన్నదెవరు? దైవమే సర్వం నడపునన్న విశ్వాసముంటే, ఇట్టి ప్రశ్నయే రాదు.

భ: దైవమే సర్వం నడుపునన్నదే యథార్థం. అటువంటప్పుడు ప్రజలకీ బోధలవల్ల ప్రయోజనమేమి?

మ: ఉపదేశ మర్థించేవారికి ఈ బోధలు. నీ నమ్మకంలో నీకు గట్టి విశ్వాసముంటే దానిని అంటిపెట్టుకో; మరియు, నీకు నలుపైపులా ఏం జరిగినా పట్టించుకోవద్దు. అంతేగాదు, అక్కడ శోకం వుండవచ్చు. ఆనందం ఉండవచ్చు. రెంటినీ లెక్కించక దైవంలో విశ్వాసముంచు. మనల నందర్నీ దైవం పరికిస్తాడనే నమ్మకం దృఢమైతేనే అది సాధ్యం.

చోప్రా: అంతటి దృఢ విశ్వాసం పొందడమెలా?

మహర్షి: అసలు విషయమే అది. అలాంటి వారికే ఈ బోధలు. దుఃఖనివృత్తి నాసించేవారున్నారు. వాళ్ళకి చెప్తారు, భగవంతుడే అన్నీ చూసుకొంటాడు. అందువల్ల ఏమి జరుగుతుందనే బెంగ అవసరం లేదు అని. వారు ఉత్తమ సాధకులైతే దాన్ని తక్షణం గ్రహించి దైవమందే స్థిరపడతారు.

కాని మరియొక తెగవారున్నారు. అంత సరళంగా సూటిగా చెప్తే వారు సులభంగా నమ్మలేరు. వారికి చాలా ప్రశ్నలు - దైవమంటే యేమి? ఆయన స్వభావమెట్టిది? ఎక్కడుంటాడు? అతన్ని తెలియడమెలాగ?" అంటూ. వారి తృప్తికై వివేచనాత్మికాలైన తర్కవాదాలవసరమౌతాయి. పూర్వపక్షాలు, సిద్ధాంతాలు; అవుననీ కాదనీ వాదాలు. ఎట్టకేలకు సత్యం బుద్ధి గోచరమవుతుంది.

బుద్ధి ఇట్లు నిశ్చయాత్మికం కాగానే, శ్రద్ధాళువైన సాధకుడు దానిని ఆచరించ పూనుకొంటాడు. 'ఈ తలపులెవరి'కని అడుగడుక్కూ తన్ను ప్రశ్నించుకొంటాడు. ఏదో ఊర్జిత, అలౌకిక శక్తియే తన్ను నడుపుతున్నదన్న నమ్మిక కుదిరేదాకా, ఈ ఆచరణ సాగిస్తూనే ఉంటాడు. దృఢనమ్మకమంటే అది. అప్పటి కతని సంశయాలన్నీ వీడిపోతాయి. మరే బోధలూ వాని కవసరం లేదు.

భ: దైవంలో మాకు విశ్వాసముంది.

మ: అది దృఢమైతే ఇన్నిప్రశ్నలు వచ్చేవేగావు. సర్వశక్తియందు విశ్వాసముంచి అతడు నిశ్చింతంగా, హాయిగా ఉంటాడు.

భ: పై చెప్పిన విశ్వాసం, ఆత్మవిచారమూ ఒకటేనా?

మ: విశ్వాసం, భక్తి, జ్ఞానం, యోగం అన్నీ ఆత్మవిచారంలో కలిసే ఉంటాయి.

భ: ఒక్కొక్కనికి దేహస్థితి ధ్యానస్థిరత కనువుగా లేకపోవచ్చు. శరీరాన్ని దానికి అనువుగా చెయ్యడానికి యోగాభ్యాసం చేయాలా?

మ: అది వాని సంస్కారాలనుబట్టి శరీరం రుగ్మతను వారించేందుకొకడు హఠయోగం చేయవచ్చు. ఇంకొకడందుకు దైవాన్ని నమ్ముకొని యుండవచ్చు. మూడోవాడు తన యిచ్ఛాశక్తి నుపయోగించవచ్చు. నాల్గవ వ్యక్తి పూర్తిగా ఉదాసీనంగా (లక్ష్య పెట్టకుండా) ఉంటాడు. కాని అందరూ ధ్యానంలో నిలబడే ప్రయత్నం చేస్తారు.

ఒకడు వేదాంతశాస్త్రంలో పూర్ణప్రజ్ఞుడు కావచ్చు. అయినా తన ఆలోచనలను అరికట్టలేకపోవచ్చు. కాని పూర్వసంస్కారం వానిని హఠయోగానికి ప్రోత్సహించవచ్చు. యోగంవల్లనే మనస్సు స్వాధీనమవుతుందని నమ్మి, అతడు దాన్ని అభ్యసిస్తాడు.

భ: ధ్యాన స్థిరత పొందడానికి, ఏ సాధనలు మంచివి?

మ: అది వాని సంస్కారము నిర్ణయిస్తుంది. ఒకనికి హఠయోగం; నామజపం ఇంకొకనికి. మొదలైనవి. ప్రధానమైనది ఆత్మవిచారము,

భః ఆత్మవిచారం, ప్రొద్దుట సాయంత్రం, ఏదో నిర్ణీత వేళల్లో చేస్తే చాలా లేదా నిరంతరం, వ్రాస్తున్నా, నడుస్తూన్నా కూడా చెయ్యాలా?

మ: అసలు నీ స్వభావం ఏమిటి? వ్రాయటమా, నడవటమా, ఉండటమా? ఎన్నడూ ఏ మార్పులేనిది ఉనికి. ఆ శుద్ధ సంస్థితి నందుకొనేదాక ఆత్మవిచారం సాగవలసిందే. ఆత్మస్థితిలో నిలబడ్డాక ఆ చింతనే అక్కరలేదు.

ఎవ్వరూ కూడా ఆలోచనలు రాకుండా, ఆలోచనల మూలాన్ని గురించి అన్వేషించరు. నేను నడుస్తాను, నేను వ్రాస్తాను - అవి తోచేటంతకాలం, అవి చేసేదెవరో వెదకిచూడు.

ఆత్మసంస్థితి తర్వాత గూడ ఇట్టి పనులు జరుగుతూనే ఉంటాయి. 'నేను మనిషిని, నేను మనిషి'నని ఎవరైనా జీవితం అనుక్షణమూ జపిస్తాడా? చేయడు. కాని వాని పనులన్నీ జరుగుతూనే ఉంటాయి.

భ: సత్యాన్ని వివేచనాత్మకంగా తెలుసుకోవాలా?

మ: అవును. కాకుంటే, 'దైవమే సర్వమూ, ఆత్మయే సర్వమూ' అనీ అనగానే, దైవానుభూతి, ఆత్మానుభూతులెందకు కలగవు? అది అనిశ్చిత బుద్ధిని సూచిస్తుంది. తనలో తాను తర్కించుకొని క్రమంగా సత్యాన్ని గుర్తించిన పిదపే అతని విశ్వాసం దృఢమవుతుంది.

## భాషణములు 597

ఒక స్విస్ వనిత, శ్రీమతి జె.సి.యస్. హిక్ రిడ్డింగ్ ప్రశ్నించింది -

భక్తురాలు: ఆత్మజ్ఞానం అంటే దానిలో గూఢ సిద్ధులు (occult powers) గూడ ఉంటాయా?

మహర్షి: నిత్యమూ, అత్యంత పరిచితమూ అయినది ఆత్మ. సిద్ధులు బయటవి. ఒకటి ప్రయత్న సాధ్యం, రెండవది అలాకాదు.

సిద్ధులు వాంఛించే మనస్సును అప్రమత్తంగా (alert)గా ఉంచాలి. అలా కాకుండా మనస్సు నశిస్తే ఆత్మ సిద్ధిస్తుంది. అహంకారం ఉంటేనే సిద్ధులు వ్యక్తమౌతాయి. అహంకారముంటేనే పరులు గోచరిస్తారు. అది లేకుంటే, వారూ కనిపించరు. అహంకారానికి అతీతమైనది ఆత్మ, అహంకారం నష్టమైన తర్వాతనే సిద్ధించేది. అహమును తొలగిస్తే, ఎవనికీ ఇతరులు తెలియరారు. ఇట్టి ప్రశ్నకూ తావూ లేదు. ఆత్మజ్ఞునికి సిద్ధులతో పనేమి?

ఆత్మజ్ఞానంతో బాటు సిద్ధులూ కలుగవచ్చు. లేకనూ పోవచ్చు. ఆత్మానుభూతి పూర్వం వానిని కోరి యున్నతనికి, ఆత్మసిద్ధి తర్వాత అవి స్ఫురించవచ్చు. అట్టివేవీ కోరకనే కేవలం ఆత్మానుభవమే అభిలషించే వారున్నారు. వారట్టి శక్తులను ప్రదర్శింపరు.

ఆత్మజ్ఞానం కల్గిన తర్వాత గూడ సిద్ధులకై యత్నించటం, సాధించటం ఉంది. కాని అట్టివి నిర్దిష్టమైన ప్రయోజనాల కోసం అంటే ఇతరుల మేలునకుపయోగించేవి. ఉదా- చూడాల విషయంలోవలె.

శిఖిధ్వజుడు శీలవంతుడైన రాజు. ఆయన భార్య చూడాల. వారిద్దరూ ఒక యోగివద్ద ఉపదేశం పొందారు. రాజు పాలనాభారంవల్ల, ఆ ఉపదేశాన్ని ఆచరణలో పాటింపలేకపోయాడు. కాని చూడాల వాటిని ఆచరణలోపెట్టి ఆత్మానుభవం పొందింది. ఆ కారణంగా ఆమె అందం ఇనుమడించింది. అధికాధికమౌతున్న ఆ సౌందర్యం జూచి రాజు కారణం తెలియగోరాడు. అందమంతా ఆత్మది; ఆయన తనలో చూచేది ఆత్మానుభవ సౌందర్యాన్నే అన్నది చూడాల. హాస్యాన్ని కట్టిపెట్టమన్నాడు రాజు. ఎందరెందరో యోగులు, ఎంతకాలమో తపస్సుచేసినా అందరానిది. అటువంటిది ఒక సాధారణ స్త్రీ, ఎప్పుడూ గృహస్థ జీవితం గడుపుతూ, ప్రాపంచిక జీవితం గడిపే ఆమెకు అది ఎలా సాధ్యం. చూడాల అందుకేమీ చిన్నబుచ్చుకోలేదు. ఆమె ఆత్మలో సుప్రతిష్ఠిత. తనవలెనే తన భర్తగూడ అట్టి స్థితినందు కోవాలి అని ఆమె కోరింది. తన అనుభూతిపట్ల ఆయనన్ను నమ్మించేదెట్లా? ఏవేనీ అలౌకిక అద్భుత సిద్ధులు చూపించితేగాని అది అయ్యేదిగాదని అట్టివాని నామె యత్నించి సాధించింది. కాని అప్పటికప్పుడే వాని నామె ప్రదర్శించలేదు. కొంతకాలం గడిచింది. లౌకిక జీవనంపై రాజుకు విరక్తి కలిగింది. అన్నిటినీ వదలి, ఆయన అడవికి తపస్సుచేయ పోతానని భార్యకు తెలిపాడు. లోన ఎంతో సంతోషించినా, రాజు కామె అతృప్తి వెల్లడించింది. ఆమెను నొప్పింపజాలక రాజు వెనుకాడినాడు. మరికొంతకాలానికి అతని విరక్తి అధికమై, భార్య అంగీకారం ఎదురు చూడకే అడవులకేగ

నిశ్చయించాడు. ఒకరాత్రి ఆమె నిద్రపోతున్నది. రాజు లేచి రహస్యంగా నగరు విడచి, అడవికి వెళ్ళిపోయాడు. తన తపస్సు కనుకూలమైన ఏకాంత స్థలాన్ని వెదకసాగాడు. అక్కడ మేల్కొన్న రాణి భర్తను గానక తన సిద్ధులవల్ల జరిగినదంతా అవగాహన చేసుకుంది. తన భర్త చేసిన దానికామె కెంతో తృప్తి కలిగింది. మంత్రులను పిలిచి, ముఖ్యమైన పనిమీద రాజు దూరమేగాడని, ఆయన వచ్చేవరకు పాలనా వ్యవహారాలు ఎప్పటిలాగే సువ్యవస్థగా నడపవలెనని ఆజ్ఞాపించి, రాజు స్థానే తానే రాజ్యాన్ని చక్కబెట్టసాగింది.

ఈ విధంగా 18 ఏండ్లు గడచిపోయాయి. ఆత్మలబ్ధికి రాజు అర్హుడైనాడని ఆమె గుర్తించింది. ఆయన కామె కుంభాదిప్రచ్ఛన్న రూపాలతో కనుపించింది. అతడాత్మజ్ఞుడై రాణితో సహా రాజధానికి తిరిగి వచ్చాడు.

సారమేమంటే, పరుల శ్రేయస్సుకై ఆత్మజ్ఞులు సప్రయత్నంగా సిద్ధులను సాధిస్తారు. కాని ఆ శక్తులు తమవన్న భ్రాంతికి వారు వశులుగారు.

భ: యోగి తన సిద్ధులను ఇతరుల నాత్మజ్ఞులను చేయటానికే ఉపయోగిస్తాడా, కాక అట్లు చేయుట కతని ఆత్మజ్ఞతయే చాలునా?

మ: ఇతర శక్తులకన్న అతని ఆత్మజ్ఞతా బలమే అధికతరము.

తనలోని అహంకారం ఎంత తగ్గితే, తన కన్యం అంత తక్కువన్న మాట. ఇతరులకు నీ వీయగల పరమ శ్రేయమేది? ఆనందము. అది శాంతి వలన జనిస్తుంది. విక్షేపం లేకుంటేనే శాంతి వర్ధిల్లగలదు. మనస్సులో కలిగే ఆలోచనలే

విక్షేపానికి మూలం. మనస్సే లేనినాడు సునిశ్చల పూర్ణశాంతి కల్గుతుంది. మనస్సును సర్వనాశం చేయనంతవరకూ శాంతియానందాలు లభించుట సాధ్యం కాదు. ఆనందం లేని వ్యక్తి ఇతరులకు ఆనందం ఈయలేడు.

మనస్సు లేని పక్షంలో గుర్తించవలసిన అన్యులూ లేరు. అందుచేత ఆత్మజ్ఞాన మాత్రమే, ఇతరుల కానంద దాయకం కాగలదు.

భ: సమాధి వస్తూపోతూ ఉంటుందా?

మ: సమాధి అంటే ఏమి? అది వాని సహజ ప్రకృతి. దానికి రాకపోకలెక్కడవి?

నీ సార స్వభావాన్ని తెలుసుకొనకపోతే నీ దృష్టికి అడ్డుఉంటుంది. ఆ అడ్డేదో కనుగొని, దాన్ని తొలగించు. ఆ రీతిగా చేసే యత్నమంతా ఆ ఆటంక నివారణానికే. అవి సత్యదృష్టి కావరోధాలు. నీ నిజ స్వభావం అలాగే ఉంటుంది. అది తెలిసిననాడు అది నిత్యంగా నిలుస్తుంది.

భ: బ్రంటన్ సమాధిలో ఒక్కగంటయే ఉన్నానన్నాడు. అందుకే ఆ ప్రశ్న అడిగాను.

మ: సాధకునికి ఆత్మశరింతి, దానివల్ల ఆనందం లభిస్తాయి. ఆ శాంతి ప్రయత్నం చేసి పొందేది. కాని యథార్థస్థితి అయత్నసిద్ధంగా ఉండాలి. అదే యథార్థము, పూర్ణమూ; అది నిత్యంగూడ. ప్రయత్నాలు క్షణికాలు. వాని ఫలాలూ అట్టివే. సత్యమూ, నిత్యమూ, స్వయంసిద్ధమూ, ఆనందమయమూ అయిన స్థితి అనుభూతమైతే, దానికీ సామాన్య జీవిత వ్యవహారానికీ వైరుద్ధ్యం కనిపించదు. యత్నపూర్వకమైన సమాధి బాహ్య వ్యవహారాలకు విరుద్ధంగా కనబడుతుంది. కొంతమంది అట్టి బాహ్యజీవనం మెచ్చవచ్చు; కాక తమ నిజ స్వభావమైన ఆనందశాంతులకు ఎట్టి భంగమూ కలుగకుండానే పదిమందితో కలసి మెలగనూవచ్చు.

## భాషణములు 598

భగవాన్ మాటల్లో ఎక్కువ హాస్యం కనిపించే ఘుట్టాలున్నాయి. ఉపమన్య భక్తవిలాస గ్రంథం చదివి వినిపించారు. తిరుజ్ఞానసంబంధర్ ఆయన బృందమూ అడవిలో పోతూండగా శ్రీ అరుణాచలేశ్వరుడు తన భూతగణాలను దోపిడిదారుల వేషాలతో పంపి, వారిని కొల్లగొట్టించడం అందు వర్ణించియుంది. శ్రీ భగవాన్ అన్నారు - 'తిరువూడల్ ఉత్సవంలో శివుణ్ణి దారి దోపిడి చేసారు. ఆయన భక్తుల విషయంగా ఆయనా అట్టిదే చేసారు. అలా ఎక్కడైనా ఉంటుందా?

## భాషణములు 599

(తావోతెచింగ్ నుండి లాట్సే) వచనం ఒకటి హాలులో చదివారు. “యోగి తన అకర్మవల్ల సర్వమూ పాలిస్తాడు."

శ్రీభగవాన్ వ్యాఖ్యానించారు - అకర్మంటే ఆగని కర్మ. నిత్య నిరతిశయ కర్మనిష్ఠ యోగి లక్షణము. అతని నిశ్చలత అతి వేగంగా తిరుగుతున్న బొంగరంలా వుంటుంది. దాని వేగం కన్నుచూడలేదు. అందుచేత అది కదలనట్టనిపిస్తుంది. కాని అది తిరుగుతూనే ఉంది. అట్టిదే పైకి కనిపించే యోగి అకర్మ. దాన్ని వివరించవలసి వుంది. ఎందుకంటే జనులకు అతని నిశ్చలత జడతగా కనిపిస్తుంది. అది నిజం కాదు.

## భాషణములు 600

వచ్చీరాని తమిళంలో ఒక యువకుడడిగాడు

భక్తుడు: ఆత్మానుభూతికల్గటాని కెంతకాలం పడుతుంది?

మహర్షి: మొదట ఆత్మయంటే ఏమో తెలుసుకో. ఆపైన అనుభూతినర్థం చేసుకో. అప్పుడు అన్నీ తెలుస్తాయి.

భ: మనస్సు ఆ అనుభూతిని హృదయంలో పొందాలి.

మ: అలాగే కానీ, కాని మనస్సంటే ఏమిటి?

భ: మనస్సు, హృదయం అన్నీ పెరుమాళ్ అవతారాలే. (పెరుమాళ్ అనే పదం వైష్ణవులు అవతారాలను ఉద్దేశించి వాడతారు)

మ: అలా అయితే మనకే విచారమూ అక్కరలేదు.

భ: ఆ పద్ధతిలో ఆత్మానుభవం వీలయ్యేదెలాగ?

మ: పెరుమాళు నీ మనస్సు నర్పించు. ఆయన అవతారం ఆయన్ను కాదని స్వతంత్రించి ఉండలేదు. ఆయనదేదో ఆయనకే అర్పించు; హాయిగానుండు.

భ: అదెలాగ చేయటం?

మ: మనస్సు మనకెట్లు తెలసింది? దాని పనులు అంటే ఆలోచనలవల్ల. ఆలోచనలు కలిగినప్పుడెల్లా అవి పెరుమాళ్ళ రీతులనుకో; అవి మరొక విధంగా ఉండనూ లేవు, అది చాలు. అదేమనస్సు నర్పించటం. పెరుమాళ్ళుకు వేరుగా ఏదైనా నిలువగలదా? అంతా పెరుమాళ్ళే. ఆయనే అందరి ద్వారా వర్తిస్తున్నారు. మనకెందుకీ చింతలు?